


JUNE 1979

జూన్ 1979

# సనాతన సారథి

# సనాతన సారథి

సత్య ధర్మ శాంతి ప్రేమల ద్వారా మానవజాతి యొక్క
సామాజిక నైతిక ఆధ్యాత్మికాభివృద్ధి కర్పితము

సంపుటము 22 జూన్ 1979 సంచిక 6

## విషయానుక్రమణిక



---

**చందాదారులు గమనించండి !**

**మీ** చందా గడువు ఏ నెల ఏ సంవత్సరమువరకు ఉన్నదో మీ చందా రసీదు కార్డులోను, మీకు నెల నెల పంపుచున్న పత్రికపైనున్న విలాసము గల కాగితము లోనూ తెలుపుచున్నాము. దానినిగమనించి, ఆ నెంబరు "..../-7-1979" అనియుండిన, మీ చందా జూలై నెలలో అయిపోవునని తెలుసుకొని, క్రొత్త చందా (సం॥నకు రూ. 6) జూన్ నెల 30వ తేదీ 1979 లోపల పత్రిక యొక్క కార్యాలయమునకు చేరునట్లు పంపవలెను.

**-: శ్రీవారి కార్యక్రమములు :-**

బాబావారు ప్రశాంతి నిలయము నందున్నారా అని తెలిసికొన గోరు భక్తులు పబ్లిక్ రిలేషన్స్ ఆఫీస్ ప్రశాంతి నిలయము పోస్టు, పెనుకొండ తాలూకా, అనంతపురం జిల్లా అనే విలాసమునకు రిప్లయి కార్డు గానీ, రిప్లయి పెయిడ్ టెలిగ్రాం గాని పంపవలెను. లేదా కొత్తచెఱువు 36 నెంబర్‌కి ఫోన్ చేయవలెను

---

**సంవత్సర చందా 6 రూ॥** గడువు ముగిసిపోవుటకు ముందుగనే మీ చందానంబరుతో చెల్లించవలెను.
వివరములకు అట్టలోపలి భాగములో చూడండి



# సత్యసాయి వాహిని

**భగవాన్ శ్రీ సత్యసాయిబాబా**

ప్రపంచమున అనేక వస్తువులు. ఆ వస్తువులకు వక్కొక్క నామము కలదు. అయితే ఈ వస్తువునకు ఈ నామమెందుకు యేర్పడినది అని యెవ్వరునూ చెప్పలేరు, చెప్పుటకు వీలుకాదు. వకవేళ చెప్పుటకు ప్రయత్నింతురా, అది వారి వూహాగానమే కానీ సత్యము కానేరదు. అంతా దైవ నిర్ణయమేకానీ మరొకటి కాదని గుర్తించిన వారు ధన్యులు. పుట్టినప్పటి నుండి చచ్చువరకూ వుండు మాటలు కానీ, పుట్టుటకు పూర్వము కానీ, లేక చచ్చిన తదుపరిగానీ వుండు మాటలకు గానీ, తల్లీ, బిడ్డలూ— ఈ శబ్దములు గానీ, ధర్మము, అధర్మము, స్వర్గము నరకము, బ్రాహ్మణ, వైశ్యులు, ఇత్యాది పదములు మానవులు సృష్టించినవి కావు, ముమ్మాటికీకావు. కావు అని చెప్పుటకు వేదములే ప్రమాణములు.

వక్క విషయము యోచింతము. పదము మాత్రమే కలిగి అర్థము లేనివి ఈ లోకముననో, లేక మరే లోకముననో వున్నటుల యెవరైననూ చూపగలరా? చూపలేరు. సాధ్యముకాదు. అందువలన ప్రతి పదమునకు అర్థమువున్నదన్న, విషయము ఆ అర్థము దైవ నిర్ణయమన్న విషయము మానవులు గుర్తించినపుడే జీవిత రహస్యము తెలుసుకొనగలరు.

కావున "బ్రాహ్మణోస్య ముఖామాసీత్" అనిననూ "చాతుర్వర్ణ్యం మాయా సృష్టం గుణ కర్మ విభాగశః" అనిననూ అందులో గల పద

ముల అర్థములను సూచించు వర్ణములను దానికి తార్కాణముగ పురుషులను ఉండియుండ వలెను కదా! వీరలను గుణకర్మల ననుసరించి నేనే సృజించు చుంటినని దైవమే తెలుపు చుండుట లేదా! వర్ణములు గుణకర్మలపై ఆధారపడి యున్నవనుటలో గుణములకునూ, వర్ణములకునూ సంబంధమున్నట్లు స్పష్టమగు చున్నది. కనుక వర్ణము అను పదమును కొంత దీర్ఘముగా ఆలోచించి, విచారించిన సులభముగా తెలియును. ఇపుడు వర్ణమనగా రంగు. ఈ అర్థము సర్వసామాన్యముగా లోకములోని వాడుక. అందరికీ తెలిసిన విషయమే కానీ దీని ఉత్పత్తి అర్థమును అందరూ యెరుగరు. దానిని తెలిసికొనినపుడే వర్ణము అను సత్య అర్థము స్పష్టమగును.

వృ అనగా వివరించుట లేక యెన్నుకొనుట అని అర్థము. ర్ణ్, రమ్ అనగా రమణ అని అర్థము కలదు. రమించుట అని కూడా కలదు. కనుక వరించి, యెన్నుకొనుట అనగా ప్రీతి పూర్వకముగా స్వీకరించుట అని వర్ణము అను శబ్దమునకు అర్థము తేలుచున్నది.

ఇక రంగులలో తెలుపు, యెరుపు, నలుపు రంగులు చాలా ప్రధానములు. ఇక మిగిలిన రంగులు వీటిలో మిశ్రమమైనవే కానీ ప్రత్యేకించినవికావు. తెలుపునకు సత్త్వగుణమనియు ఎరుపునకు రజోగుణమనియు, నలుపునకు తమోగుణమనియు సృష్టిరహస్యము. లోక సహజము. పదముల అర్థము, జీవులు యే గుణములను అభిమానించు చున్నారో, వరించు చున్నారో, కోరుచున్నారో ఆయా గుణములకు అనుబంధముగా జన్మించుచున్నారు. కాన వర్ణములు తమకు తాము కోరి తెచ్చుకున్నవేకాని, వకరు కల్పించినవి కావు. ఈ కోరిక జీవుని బుద్ధి ననుసరించి యుండును. సామాన్యముగా కోరిక ననుసరించి బుద్ధి అని అందురు. బుద్ధి ననుసరించి కర్మలు సాగుచుండును, కర్మల ననుసరించి జన్మలు కలుగును.

"ఇదే గుణకర్మ విభాగశః" అను దాని తాత్పర్యము, ఇంత విపులముగా జాతి, మత, కుల గోత్రాదుల యందు, జనన, మరణముల కారణములు శ్రుతి స్మృతులు నిరూపించుచుండ మానవులు గ్రహించలేక తమ తెలివితేటలకు తోచినటుల అర్థములు చెప్పుకుని ఆనందించు చుండుట అజ్ఞానముతప్ప మరేమి ? లేక అన్నియూ తెలిసిన వారమను అహంకారము తప్పమరేమి ? అహంకారము కూడనూ అజ్ఞాన సంతతియేకదా ! దీనిని పట్టి జాతి మత కులాదులు గుణకర్మ లాధారముగా చేసికొని కలుగును- అనుట నిశ్శంశయము. ఇవి మానవుల విభజనలు కావు అన్న సత్యాన్ని గుర్తించడము అత్యవసరము. వీటికి వేదమే ప్రమాణము. వేదమే ఆధారము.

భారతభూమి కర్మభూమి అని అందురు. ఇది కర్మ క్షేత్రము. ప్రతిమానవుడూ ఈ కర్మ క్షేత్ర యాత్రికుడు కనుక ఈ దేశములో కర్మ ప్రధానము. కనుకనే దీనికి ఈ నామము

అమరెను. ఉచ్చనీచ జన్మము భాగ్య భోగ్యములు, బంధ మోక్షములు మన చేతిలోనివే అని శ్రుతి యెలుగెత్తి చాటుచున్నది. యేమని: "సయధాక్రతు రస్మిన్ లోకే పురుషో భవతి తధేతః ప్రేత్యే భవతి" అని ఈ లోకములో పురుషుడు యెట్టి రూపమును ప్రార్థించునో అట్టి రూపమును తిరిగి మరణాంతరము ప్రాప్తించును. అని దీని యొక్క అర్థము. కర్మానుగుణముగా జన్మకలుగుచున్నది అనుట సత్యము. ఇప్పటి మన భోగ భాగ్యాదులు, మన స్వభావాలు, గుణములు, బుద్ధులు, సుఖ దుఃఖాదులు పూర్వజన్మార్జితములు. అటులనే ఈ జన్మమున యెట్టి బుద్ధులను అనుసరించి కర్మలు చేతుమో దానికి అనుసణముగా ముందు జన్మమేర్పడును. కొందరు మంచి జాతియందు జన్మించియూ చెడు కర్మలనాచరింతురు. హీన జాతియందు జన్మించి మంచి కర్మలు చేతురు. వీని విషయమేమి అని మనలో మనము సామాన్యముగా చర్చించు చుందుము అనగా బ్రాహ్మణకులమందు పుట్టి చెడు కర్మలు అనగా రజోతమో గుణ కర్మలు ఆచరింతురు, తక్కువ జాతి యందు జన్మించి సాత్వికమైన మంచి కర్మలు చేయుచుందురు, ఇట్టివారు జన్మ బ్రాహ్మణులు- మాత్రమే కానీ కర్మ బ్రాహ్మణులు కారు. జన్మహీనులే కానీ కర్మ హీనులు కారు. జన్మ, కర్మలను రెండింటినీ యేకీభవించిన పురుషులే సరియైన జాతికి బ్రాహ్మణము అని కూడా వేదము అంగీకరించుచున్నది.

లోకములో శుద్ధ సాత్వికులు వుండుట అరుదు. అట్టివారిలో రజోసాత్విక మిశ్రమములు వుండును. అట్టివారు జన్మమున ఉన్నత స్థాయి యందుండి, కర్మమున రాజసిక చర్యలను అనుభవింతురు. ఇట్టివికూడా వర్ణ మిశ్రమముల వేదము దాచక చూపుచున్నది. వేదము నిష్పక్షపాతి. వకరిని మెచ్చుకొనుట గానీ మరొకరిని తూలనాడుట కానీ వుండదు. వున్న సత్యాన్ని వున్నటుల చెప్పుచున్నది. చిన్న ఉదాహరణము. కౌశికుడు క్షత్రియుడు అనగా రజో గుణ సంపన్నుడు. అయితే జన్మాంతర కర్మఫలముగా అతనిలో సాత్విక భావములు ప్రవేశించి సత్యవ్రతుడుగా సంచరించెను. స్వచ్ఛ చిత్తుడుగా తన జీవితమును మార్చుకొనెను. అతడుఉచ్చరించిన మంత్రమే గాయత్రి మంత్రము. ఈ మంత్రమునకు కర్త కౌశికుడే. అతడే విశ్వామిత్రుడు, విశ్వమునకే మిత్రుడాయెను. ఆ మంత్రమును బ్రాహ్మణు లందరూ పవిత్ర ప్రసాదముగా అందుకొని ఆచరించి, ఆనందించుచున్నారు. ఇతడు జన్మ క్షత్రియుడే కానీ, కర్మ బ్రాహ్మణుడు. దీనిని స్మృతి అంగీకరించింది. కాని దైవవాణి అయిన వేదము సర్వమానవులకూ సమాన నీతి బోధించు చున్నదే కాని పక్షపాతము యే మాత్రము అందులో లేదు. జీవుని కర్మ గుణ ముల ననుసరించి జన్మకులములు కలుగు చున్నవి.

ఇక్కడ ఈ ఆధునిక యుగపురుషులకు సామాన్యముగా సందియములు కలుగవచ్చును.

ఇది సహజమే. యేమిటా సందియము. సృష్టి లోనే వర్ణ విభాగములు వున్నవనుట సత్యమ యిన ఇవి అన్ని దేశములలోనూ వుండవలెను కదా! ఒక భారతదేశము నందేయెందుకు వుండాలని? సృష్టియందుగల అన్ని విషయ ములు అన్ని తావులలోనా యున్నవా! వుండ నేరవు. ఆయా ప్రాంతమును, ఆయా వాతా వరణమును, ఆయా శాస్త్రములను అనుసరించి ఆయా తావులకు అనుగుణ్యముగా ఆయా నీమములు యేర్పడుట ప్రకృతి యొక్క సహజము. భరతఖండమున గల వృక్షజాతి లన్నియూ ఇతర ఖండములలో వుండవలెనని నియమము లేదు. ఆకాశమున నున్న నక్షత్ర ములు భూమిపై నుండవలెనని కోరుట సాధ్యముకాదు. నీటిలో జీవించే చేపలు కొండ లలో నివసించాలని నిబంధన లేదు. ఏది యెక్కడ, ఎందుకు ఎప్పుడు జరుగ వలెనో దాని నియామకుడు అయిన సర్వేశ్వరునకు తెలియును. అందరు దానిని నిర్మించ సాధ్యము కాదు. జననాదులు, దేశకాల కర్మ పరిస్థితు లలో సంబంధించి యుండును కానీ అవి మన అనుకూల ప్రతికూలములలో చేరియుండవు. ప్రత్యక్షమునే ఆధారముగా చేసికొని జీవించు బుద్ధికి ఈ వర్ణము లేమిటని సంశయము కలుగును ఇది సహజము. దీనినే అహంకార మని అందురు. వస్తు తత్త్వమువేరు, అహం కారము వేరు, వస్తుతత్త్వము తెలియక చిత్తమొచ్చినట్లు చేయ బూనిన, చెప్పదొడ గిన ఇది అజ్ఞాన లక్షణ మనవచ్చు.



# బృందావనం పిలుపు

భారతీయ సంస్కృతి, ఆధ్యాత్మిక తత్వం పైన జరిగే నెలరోజుల వేసవి తరగతులలో పాల్గొన టానికి భారతదేశములోని అన్నిరాష్ట్రలలోని కళాశాలల నుంచి, కొన్ని విదేశాలలోని కళాశాలల నుంచి 750 మంది విద్యార్థులు బృందావనం వచ్చారు. భగవాన్ సత్యసాయిబాబా వారి దివ్యసమక్షంలో శ్రీ సత్యసాయి కేంద్ర ట్రస్టువారి ఆధ్వర్యములో జరుగుతున్న సప్తమ వార్షిక సమావేశాలు యివి! తరగతులు 20.5.1979 న ప్రారంభించబడినై. తరగతుల మొదటివారము అంతా భగవద్గీతాధ్యయనానికి అంకి తం అయింది. నేటి యువతరానికి గీత ఏ విధంగా ఉపయోగపడేదీ మొదటివారములో సమగ్రంగా పరిశీలింపబడుతుంది. భగవాన్ ఆదేశానుసారం ఈ సంవత్సరము కార్యక్రమాల్లో, ప్రతిరోజూ రెండు గంటలు గ్రామీణ సేవా కార్యక్రమం క్రొత్తగా ప్రవేశపరచారు. ఉదయం పూట బృందావనం వేసవి

తరగతుల శిబిరంయొక్క పరిసరాల్లోని గ్రామాల్లో ఈ సేవకార్యక్రమము జరుగుతుంది సేవా బృందానికి శ్రీ సత్యసాయి కళాశాల అధ్యాపకులు మార్గదర్శకులుగా వుండగా, కళాశాల విద్యార్థులలో, ఈ గ్రామాలకు సంబంధించిన వారు సహచరులుగా వుంటారు. ఈ తరగతులలో పాల్గొనే విద్యార్థినీ విద్యార్థులు యోగాసనముల తరగతులకు హాజరవుతారు; భజనలూ నగర సంకీర్తనలూ చేస్తారు. ఆదివారాల్లో వక్తృత్వపు పోటీల్లోనూ, క్విజ్ వంటి కార్యక్రమాల్లోనూ పాల్గొంటారు.

ఇలాటి కార్యక్రమాలన్నింటికంటే చాలా ముఖ్యమైనది భగవాన్ ప్రతిరోజూ చేసే దివ్య ప్రబోధం ! నెలరోజులపాటు స్వామి దివ్యసమక్షంలో పాల్గొనే వారందరికీ స్వామి అందించే అపూర్వావకాశాలూ, అనుగ్రహించే అమూల్యమైన దివ్యకృపారూపములైన బహుమతులూ–ఇవి చాలా ముఖ్యమైనవి !

వేసవి తరగతులు ప్రారంభించిన రోజున ఉదయం 5 గంటలకు ప్రణవనాదోచ్చారణతో విద్యార్థులు తాము నివశించే హాష్టలు భవనం నుండి బయలుదేరి, నగర సంకీర్తనం కావించి 6 గంటలకు స్వామి సుప్రభాత దర్శనం చేసుకున్నారు. ఉదయం 8.30 గంటలకు తరగతులలో పాల్గొనేవారూ, భక్తులూ, అత్యధిక సంఖ్యలో భారతదేశం నలుమూలల నుంచీ వచ్చి చేరిన వారంతా బృందావనం నుంచి ఒక ఊరేగింపు ఉత్సవంగా శ్రీ సత్యసాయి కళాశాల ఆడిటోరియం దగ్గరకు చేరారు. భారతదేశపు సుప్రీమ్‌కోర్టు న్యాయమూర్తి శ్రీ వి. ఆర్. కృష్ణఅయ్యరు, శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్ శ్రీ శాంతప్పగారలు భగవాన్‌తోపాటు కారులో వుండి ఈ ఉత్సవంలో పాల్గొన్నారు. ఉత్సవమార్గం కేరళనుంచి వచ్చిన భక్తుల చేత అత్యంత రమణీయంగా, నేత్రోత్సవంగా అలంకరింపబడింది. ముందు భజనబృందాలుగా స్త్రీ పురుషులు అందరూ నడుస్తున్నారు. భగవాన్ దివ్య సందర్శనాభిలాషులైన భక్తులందరికీ అదొక అపూర్వ సన్నివేశం !

శ్రీ సత్యసాయి కళాశాల విద్యార్థులు వేద మంత్రాలను పఠించుతూ వుండగా సభా కార్యక్రమం ప్రారంభము అయింది. కేంద్ర ట్రష్టు తరఫున డాక్టర్ యస్ భగవంతంగారు సభికులను ఆహ్వానించారు. తర్వాత డాక్టర్ వి కె. గోకాక్ గారు ప్రతి సంవత్సరం జరిగే ఈ సమావేశాల ప్రాముఖ్యత వివరిస్తూ, క్రమ క్రమంగా పెంపొందుతున్న ఈ సభలు శ్రీ సత్యసాయి విద్యావిషయిక పునరుజ్జీవన ప్రణాళికలో ప్రధానపాత్ర ఎలా వహిస్తున్నదీ వివరించారు. వీరిలా ప్రసంగించారు. "మానవజాతి యెదుర్కొంటున్న సమస్యలకు అనుగుణంగా నేటి విద్యావిధానం రూపొందటం లేదు. మనచుట్టు నైతిక విలువలు పతనమై పోతున్నాయి. మతాతీత వ్యవస్థ కోసం ఉబలాట పడుతూన్న భారతదేశములో ఆధ్యాత్మిక దృక్పధం ప్రక్కకు నెట్టివేయబడింది. పాఠశాలల నుంచీ, కళాశాలల నుంచీ ఉత్తర్ణులయ్యే విద్యార్థులు తమ అమూల్యమైన వారసత్వాన్ని గుర్తించలేనివారుగా తయారవుతున్నారు. ఇచట పాల్గొంటున్న యువతీ యువకులలోగల సంకుచిత లక్ష్యాలను తొలగించి విశ్వజనీనమైన దృక్పధం నెలకోల్పటంకోసమూ, ఆధ్యాత్మకత. యోగం, ధ్యానం మొదలగు వానికొరకు తహతహపడునట్లు చేయటం కోసం ఈ వేసవి తరగతులు రూపొందింపబడ్డాయి. అన్నింటికీ మించి ఈనాడు ప్రపంచం అంతా వెలుగు కోసం, ప్రేమకోసము ఏ భగవంతుని ఆశ్రయిస్తోందో ప్రేమ, జ్ఞాన స్వరూపుడైన ఆ భగవత్స్వరూపుని ద్వారా ఇచట వారందరిని పర్యవేక్షణ, ఉత్తే

జములు లభిస్తున్నాయి. అన్నారు. శ్రీ వి. కె. గోకాక్.

తర్వాత గౌరవనీయులైన వి. ఆర్. కృష్ణ అయ్యర్ గారు ఈ వేసవి తరగతులను ప్రారంభిస్తున్న సూచనగా జ్యోతిని వెలిగించారు. వారి యొక్క ప్రారంభోపన్యాసములో భగవాన్ నెమ్మదిగా నిలకడగా మనలని అందరినీ తమ దివ్య కార్యక్రమములో ఉపకారణములుగా ఎలా పరివర్తింపజేస్తున్నదీ వివరించారు. వారెక్కడ నడుస్తారో అదే పవిత్రక్షేత్రం ! వారెక్కడ ఆశీనులవుతారో అదే పవిత్ర మందిరం ! .... గత కాలములోని ప్రవక్తలందరూ కలసి వారియందు మూర్తీభవించారు. విమోహతను అణచివేసే కారుణీతత్వాన్ని ప్రేమధర్మాన్ని మనకు బోధిస్తున్నారు అన్నారు న్యాయమూర్తులు. సైంటిష్టులలో నేడు పేరుకుపోతున్న చాంధసత్వాన్నీ, హేతువాదులలో అలముకుంటున్న మూఢనమ్మకాన్నీ వారు ఖండించారు. సైన్సువల్ల వ్యాపించే కుహనా—హేతువాదపు—తీవ్ర ధోరణుల నుంచి రక్షించుకోవలసినదనీ సత్యాన్వేషకులలో నేడు పాదుకొంటున్న పదార్థగత సాంకేతిక దృష్టిని అలవరుచుకోవలసినదనీ వారు విద్యార్థులకు హితవు చెప్పారు !

శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్, శ్రీ శాంతప్పగారు సభకు అధ్యక్షత వహించారు. విలువలు పతనమైపోతున్న కారణంగా విశ్వవిద్యాలయములోని విద్యార్థులలో సత్‌శీలిత, సత్‌ప్రవర్తనలలో కలుగుతున్న కాలుష్యాన్నిగురించీ విద్యాసంస్థలలోకే గాక ప్రపంచం అంతటా వ్యాపించుతున్న కాలుష్యం గురించీ వారు మాట్లాడుతూ, కళాశాలలద్వారా, యింకా యితర విద్యాసంస్థలద్వారా ఈ వేసవి ప్రబోధల ద్వారా భగవాన్ సత్యసాయిబాబా వారు మరల దివ్యత్వం యొక్క ఔన్నత్యాన్ని పునఃప్రతిష్ఠ చేస్తున్నందుకు నమోవాకములు సమర్పించారు.

భగవాన్ తమ దివ్య సందేశము వినిపించుతూ పాశ్చాత్య నాగరికత మనదేశములోని యువతరం మనస్సులపై ముద్రించిన దుష్టవ్యామోహాన్ని గూర్చి తెలియజేశారు. భగవాన్ యిలా ప్రబోధించారు. కళాశాలలోని విద్యార్థులు తమ అమూల్యవారసత్వం అయిన భారతీయ సంస్కృతిని తమనుంచి దూరం చేసుకుంటున్నారు. తృణీకరిస్తున్నారు. ప్రజలలో ధర్మం యొక్క ఆదర్శం తన ప్రభావ ముద్రను చూపించటంలేదు. తత్ఫలితంగా దురాశ, హింస, అన్యాయములు చెలరేగి శాంతిని సామరస్యాన్ని తుడిచివేస్తూవుంటే ప్రేమ భావమనేది మానవులో హరించి పోతోంది

"భారతీయసంస్కృతిని ఆధ్యాత్మికతను తమ జన్మ హక్కుగా ఆశించే యువతీ యువకులపై ఒక గురుతరమైన బాధ్యతవుంది. దానికి కావలసిన అర్హతను వారు సంపాదించుకోవాలి. భరతమాత తన బిడ్డలకోసం నిక్షిప్తం చేసి వుంచిన పెన్నిధులను నిర్లక్ష్యంగా చూడటంవల్ల, ఆమె కన్నీరు పెట్టుకుంటున్నది. ఆమె కన్నీటిని ఈ యువతీ యువకులు తుడవాలి. ఈ దేశాన్ని దాశ్యం నుంచి విముక్తిపరచిన మహాపురుషులు, వనితలు భారతీయ సంస్కృతి భద్రపరచిన ఉన్నతాశయములను నిలబెట్టవలెననే ఆశించారు. వారు కూడా వారి కళాశాలరోజులలో ఈ ఆదర్శాలను అలవరచుకోవలెననీ, పెంపొందించుకోవలెననీ ప్రయత్నించారు. కానీ ఈనాడు పరిపాలకులకు ఈ ఆదర్శాలను పోషించవలెననే సంకల్పం లేదు. పరిపాలకులను ఎన్నుకొనే ప్రజలలో కూడా వారిని సక్రమ మార్గములో పెట్టవలెననే అభిలాష లేదు. ఈనాటి విద్యార్థులు "ఆడంబర జీవితము అధోగతి ఆలోచనలు" అనే దుష్టాదర్శమును విడనాడి, "ఉన్న

తాశయములు-సాధారణ జీవనము" అను ఆదర్శాన్ని తమలో నెలకొల్పుకోవాలి. అద్భుతమైన నైతిక జీవనం, ఆధ్యాత్మిక సాధన అనేది స్థిరమై, సుఖ దాయకమైన సమాజానికి కావలసిన పునాదులు. ఆడంబరాలవైపు, అల్పబుద్ధివైపు మీ మనస్సులు పోనీయవద్దు. ఉద్రిక్త స్వభావాన్ని, యింద్రియ లోలత్వాన్నీ తగ్గించుకోండి. సమస్త మానవాళి యొక్క సంక్షేమం కోసం, అభివృద్ధి కోసం మన మహర్షులు, తపస్వులు ఏర్పరిచిన భారతీయ జీవన విధానం గురించి అధికాధికంగా తెలుసుకోవటానికి ప్రయత్నించండి." అని భగవాన్ ప్రబోధించారు.

21-5-79 న భారతదేశం అంతటి నుంచీ వచ్చిన 190 మంది జిల్లా సేవాదళ్ కన్వీనర్ల 5 రోజుల సెంట్రల్ ట్రయినింగ్ క్యాంపును కళాశాల ఆడిటోరియంలో భగవాన్ ప్రారంభించారు. సంఘంలో సేవాదళం నిర్వహించవలసిన కృషియొక్క వివిధాంశాల్నూ, సేవాదళ్ సభ్యులలో విశిష్ట స్థానం పొందుటకై సంపాదించుకొనవలసిన అర్హతలూ ఈ శిక్షణ తరగతులలోని చర్చనీయాంశాలు. సేవాదళ్ విభాగం యొక్క ఆదర్శాలను గూర్చి, సేవాదళ్ నిర్వహణ గూర్చీ, సేవాదళ్ సభ్యులకూ, కొత్తగా చేరే సభ్యులకూ ఏర్పాటు చేయవలసిన శిక్షణ శిబిరాలకు గురించీ, ప్రస్తుతం పల్లెసీమల్లో సేవాదళం ప్రారంభించిన సాంఘిక సేవా ఉద్యమం, వివరాలను గురించీ ప్రసంగాలు కూడా ఈ శిక్షణ తరగతులలో నిర్వహింప బడినవి. చర్చలకు, ప్రదర్శనలకు కొంత సమయం కూడా వెచ్చించబడింది. ప్రతిరోజూ భగవాన్ అనుగ్రహించిన ప్రసంగాలూ, శిక్షణలో పాల్గొనే సేవాదళ్ కన్వీనర్లకు గల సందేహాలకు స్వామి సమాధానాలూ ఈ కార్యక్రమంలోని ప్రయోజనకరమై, సృజనశీలములైన అంశాలు, "సేవాదళ్—ఆంతరిక మైన విశిష్టత" అను అంశంపైన డా॥ వి.కె. గోకాక్ గారు ఉజ్వలంగా ప్రసంగించారు. సాంఘిక సంస్కరణయే కాక, వ్యక్తిగత పరివర్తనం కూడా ప్రధాన మైనది కావటం వల్ల శ్రీ సత్యసాయి సేవాదళ్ చాలా విశిష్టమైనదని వారు విశదీకరించారు. ఈ రెండు విజయాలనూ సేవా కార్యక్రమం సాధించాలి. "సేవ కోసం సేవ కాదు. సేవకునికి ఆధ్యాత్మిక శిక్షణ యివ్వాలి. దానివల్ల అహంభావం సన్నగిల్లి ఉద్రేకాలు నశిస్తాయి. సేవ చేయాలనే భావం సేవకుని అంతరాంతరాలలో నుంచి కలగాలి. సేవా ధర్మం ధ్యాన, యోగ సాధనలతో బలపడాలి." అన్నారు బాబా. సేవాదళ్ సభ్యులను ప్రేరేపించే మానసికమైన ధోరణులను డా॥ వి కె. గోకాక్‌గారు విశ్లేషించారు. సంఘ సేవా కార్యకర్తలలో గల ఐదు విధములైన తేడాలను వారు వివరించారు,

1) కొందరు సంఘ సేవకులున్నారు. వారికి వారుగా సేవకులమని చెప్పుకుంటారు. నిజానికి, వారు సంఘానికి 'సేవకులు' కారు. సంఘానికి 'ప్రభువులు' ఈ తెగ వారికి వారు చేసే సేవా సమయం నిజంగా సేవా సమయం కాకుండా, వారి నియంతృత్వానికి, దోపిడీ తనానికీ సమయం అవుతుంది.

2) కొంద రున్నారు. వారూ సంఘసేవకులమనే చీటీలు భుజాలకు అతికించుకుంటారు. కాని నిజంగా ప్రజలు దుర్భర పరిస్థితుల్లో వుంటున్న తరుణంతోవారి బాధలకు వీరేమాత్రమూ చలించరు వారు చేసే మంచి ఏమిటంటే వారు మౌనం వహించి కూర్చోవటమే. వారు సేవ చేయకపోయినా, వారివల్ల అపకారం జరగదు. వారు చాలా బద్ధకస్తులు.

3) కొందరికి సేవ చేయాలనే వుంటుంది. అలాటి వారు జబ్బుపడినప్పుడు వారికోసం ఏదో ఆస్పత్రిలో ఒక ప్రత్యేకమైన వార్డు నిర్మించుకుంటారు. ఆస్పత్రికి ఆ వార్డును దానం చేస్తారు. వారికేదో ఆపద కలిగి

నప్పుడే వారికి యితరుల యందు దయ, సానుభూతి కలుగుతాయి. వారుచేసే సేవలో ఆ రీతిగా వారి అహం కనిపించుతుంది.

4) కొందరున్నారు. సోదరునికో, సోదరికో, బిడ్డకో, ఒక పశువుకో, మొక్కకో సేవ చేసినప్పుడు వారికో విధమైన సంతృప్తి భావన కలుగుతుంది. అలాటి సేవావకాశం కలిగించిన తమ అదృష్టం తలుచుకొని వారు ఒక వింత ఆనందం పొందుతారు. ఇలాటి సందర్భంలో వారిలో గల అహం వేగంగా అదృశ్యమై పోగా, సేవకుడు అహంకారం యొక్క బంధంలో పడిపోక విముక్తి పొందుతాడు.

5) ఐదవ తరగతి వారున్నారు. వారు సేవచేస్తూ ఆసేవను పరమేశ్వరునికి చేస్తున్నట్లుగా, పరమేశ్వరుని ఆరాధిస్తున్నట్లుగా ఆనందిస్తారు. గ్రుడ్డి, కుంటి, బీద, నిరక్షరాస్యుల రూపంలో పరమేశ్వరుడు వారికి ప్రత్యక్షమై వారికి సేవా భాగ్యం కలిగించినట్లు వారు నందిస్తారు.

భగవాన్ తమ ప్రారంభోపన్యాసంలో సేవాదళ్ సభ్యులను ఉద్దేశించి నిష్కామకర్మ మార్గాన్ని అవలంభించవలెనని అన్నారు. "పరోపకార బుద్ధి, యితరులకు సహాయం చేయటం, యితరులను భగవత్సాన్నిధ్యానికి కొనిపోవటం మనకు సహజ గుణం కనుక మనం సేవ చేయక వూరుకోలేము. నిజానికి యితరులను ప్రేమించటం సేవించటం వల్ల ప్రేమించేవాడికీ, సేవించేవాడికీ ఆ ప్రేమలోనూ సేవలోనూ ఆనందం లభిస్తుంది. భోగభాగ్యాలను భోగభాగ్యాల కోసమే మనం కోరుకోము. మనకోసం కోరుకుంటాం. ప్రతి పనికీ చివరి ధ్యేయం కర్తయొక్క ఆత్మానందమే. అందువల్ల పనిచేయాలనే అభిలాషలో ఉన్నతాశయం వుంటే ఆ పని యొక్క ఫలితం కూడా ఉన్నతమైనట్టిదే అవుతుంది. ఆశయం నికృష్టమైనదైతే ఫలితమూ నికృష్టంగా వుంటుంది. ఒకరిని రక్షించుటకూ, ఓదార్చుటకూ, సుఖపెట్టుటకూ, సేవించుటకూ వెనుక గల అభిలాష గొప్పదే కానీ అహంభావం అడ్డు తగిలి క్షణికమైన కీర్తి కోసమో, పేరుప్రతిష్టల కోసమో, అధికారం కోసమో అభిలషించటం చాలా నికృష్టమైనది. సేవించు. సేవించుట అనే ఉద్యమం కొరకే నీవు మానవుడవుగా జన్మించావు. సేవించాలనే ఈ ఆకాంక్ష నీలోని నరనరాన్నీ, ప్రతి కండరాన్నీ, ప్రతి అణువునూ కార్యోన్ముఖం చేయాలి.

"విధి నిర్వహణ యే దైవం" (Duty is God) అనే మాటలను మనం పలుసార్లు పలుకుతూ వుంటాం. కానీ వాటిలోని అంతరార్థన్నీ, ప్రాముఖ్యాన్నీ గుర్తించటం లేదు. "విధి నిర్వహణ అనగా ఏమి ?" "విధి నిర్వహణ ఎందుకు చేయాలి ?" "ఎవరికి చేయాలి ?" ఇలాటి ప్రశ్నలకు సమాధానముల కోసం మీలో మీరు యోచించుకోవాలి. మానవుడు సమాజంలో ఒక సభ్యుడుగా జన్మిస్తాడు. సాంఘిక స్వరూపంలో అతడొక అంగం వంటి వాడు. కనుక అతడి ఆరోగ్యం అలవాట్లు, అతడు పలికే భాష, అతడు అంగీకరించే మానసిక భావాలూ, అతడు అనుభవించే ఆవేదనలూ, అనుభూతులూ, అతడి జీవిత విధానం, అతని ఆలోచనలకు గల లక్ష్యం, ఆశయం, అవి కార్య రూపం ధరించే మార్గాలూ—ఇవన్నీ కూడా విడదీయటానికి వీలులేని రీతిగా ఏ సంఘంలో అతడు కలసి వుంటాడో, ఆ సంఘంచేతనే పోషింపబడుతూ, రూపొందింపబడుతూవుంటాయి. స్వేచ్ఛ స్వాతంత్ర్యాలు నా జన్మ హక్కు అనుకుంటాడు. అయితే సమాజానికి కూడా ఆ మానవుని చేత సేవ చేయించుకునే ప్రాథమిక హక్కు వుంది. ఈ సమాజం యొక్క హక్కు మానవుని జన్మ హక్కును కూడా అధిగమించేది కనుక సమాజం మానవుని చేత సేవ చేయించుకొనే తన హక్కును కూడా మానవుని ముందుంచుతుంది.

తన స్వాతంత్ర్యాన్ని ఒక హక్కుగా వినియోగించే మానవుడు, అదే హక్కును కలిగిన సమాజంలోని మరొక మానవునికి తన హక్కు ద్వారా ఎలాటి అప కారాన్నీ. కీడునూ కలిగించటానికి వీలులేదు.

"భగవంతుడు కూడా మానవాళి సంక్షేమం కొరకై తనకు గల స్వేచ్ఛను పరిమితం కావించు కున్నాడు. ఉదాహరణకు యిద్దరు వ్యవసాయదారులను తీసుకుందాం. వారి పొలాలు ప్రక్క ప్రక్కనే వుంటాయి. వారిద్దరూ వేర్వేరుగా భగవంతుని ప్రార్థిస్తారు. ఒకనికి వెంటనే అతని పంటలకోసం వర్షం కురవాలి. మరొకనికి ఎండ కావాలి. అతని కుమార్తె వివాహం కనుక బంధుమిత్రు లందరికీ అసౌకర్యం కలుగకుండా అతనికి వర్షం కురవరాదు. ప్రాపంచికమైన యిలాటి ప్రార్థనలు భగవంతుని చేరవు. యిలాటి అల్పమైన ప్రార్థనలకోసం ఏర్పా టయిన ఉప దేవతలచేత ఈ ప్రార్థనలు ఫలిస్తూ వుంటాయి. భగవంతుడు ఆలకించి అనుగ్రహించే ప్రార్థనలు ఇలా వుంటాయి. (1) ఆ ప్రార్థన పవిత్ర మైన హృదయం నుంచి వెలువడాలి. (2) అంతులేని విశ్వప్రేమ నుంచి వెలువడాలి. (8) నిష్కామ భావంతో, ఫలానుభవ అపేక్ష లేకుండా వుండాలి.

"సేవాదళ్ సభ్యులు ఇలాటి నిస్వార్థ ప్రేమను అలవరచుకొనక పోయినా, నిర్భయంగా, స్వలాభా పేక్ష లేకుండా సేవ చేయక పోయినా, వారియొక్క సముచిత మర్యాదకు స్థానానికి అనుగుణంగా ప్రవర్తిం చని వారవుతారు. వారి పలన వారు పనిచేసే సంస్థకు అపకీర్తిని ఆపాదించిన వారవుతారు.

"నవ విధ భక్తి మార్గంలో ఏడవది సేవా భావం, ఎనిమిదవది స్నేహభావం. పరమేశ్వరునితో మిత్రుడై అర్జునునివలె స్నేహం చేయటం స్నేహభక్తి లక్షణం. సాధకుడు తన సాధనతో సుస్థిరతను, సురక్షణను సాధించినప్పుడే ఈ స్నేహభక్తి అలవడు తుంది.

"మానవుని సోదరభావం స్నేహభావం అంతటి ఉదాత్తమైనది కాదు. సోదరులు కూడా తమ పిత్రా ర్జితం పంచుకొనుట కోసం పోట్లాడుకుంటారు. కాని సత్యసాయి సేవాదళ్‌లో పనిచేసే సేవకుని దృష్టిలో ఏకత్వ భావం, తాదాత్మ్య భావం కలగాలి. ఎవరికి మీరు సేవ చేస్తున్నారో వారికంటె మీరు భిన్నమైన వారు కారు. వారూ మీరు ఒకటే. ఇరువురిలోనూ వున్నది ఒకే సత్యం. ఒకే ఆత్మ రూపంలో ఇరువురి లోనూ దివ్య ప్రకాశం వున్నది."

# జ్ఞాన-విజ్ఞాన మూర్తి

భగవాన్ దర్శనభాగ్యం పొందిన సైంటిస్టు లలో నేనూ ఒకడిని. భగవాన్‌ను సన్నిహితంగా దర్శించి వారి దివ్యానుగ్రహాన్ని ఆకాంక్షిస్తూ మాలో చాలామంది నిరీక్షిస్తున్నాం. మా ప్రార్థనల ఫలితంగా 1979 జనవరి 21న మాకు భగవాన్ దర్శన భాగ్యం లభించింది. 'సనాతనసారథి' (నెం. 3 సంపుటి 22, మార్చి 1979) సంచికలో వ్రాసిన ప్రొఫెసర్ ఎస్. వి. పప్పు కూడ మాతో ఉన్నారు.

సైన్సు గురించి మతం గురించి ఏవైనా సందేహాలు ఉంటే అడగవలసిందిగా భగవాన్ మమ్మల్ని అడిగినప్పటికీ, విలువైన ఆ సమయాన్ని వ్యర్థమైన చర్చలలో వృథా చేసుకోరాదని అని అనుకున్నాం. నాదృష్టిలో మతమనేది బుద్ధివాదానికి అతీతమైనది. బుద్ధిబలంతోసాగే సైన్సు పరిశోధనలు ఎక్కడివరకు వెళ్ళి ఇకముందడుగు వేయలేక నిలు స్తాయో అక్కడినుండి ప్రారంభం అయ్యేది మతం. సైంటిస్టులలో అతీంద్రియ మహాసైంటిస్టు అయిన 'జ్ఞాన'-విజ్ఞానమూర్తి భగవాన్ అట్టి మహోన్నత మైన అలౌకిక శాస్త్రజ్ఞుని సమక్షంలో కూర్చునిఉన్నా మన్న సంగతి నాలో కలిగించి. టాటా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఫండమెంటల్ రీసెర్చి (టి. ఐ. ఎఫ్. ఆర్) లో పనిచేస్తున్న నా సహ విద్యార్థి ఒకరు లోగడ అన్నమాటలు నాకు ఈ సందర్భంలో జ్ఞప్తికివచ్చాయి. "పదార్థ స్వభావం నీకు తెలియాలంటె శ్రీసత్యసాయి బాబా వద్దకువెళ్ళు" అని ఆమిత్రుడు చెప్పాడు. అతను ఆమాటలు అప్పట్లో తమాషాగా అనిఉండ వచ్చును, కాని ఎంతో నిజమని తేలింది మరొక సందర్భంలో సి. ఎస్. ఐ. ఆర్. లెబరేటరీ డైరెక్టరు ఒకరు ఇంజినీర్ల సంస్థలో మాట్లాడుతూ పదార్థ అంతర్ పరిణామంలో శక్తితో పాటు 'జ్ఞానం' కూడ ఆవిర్భవించవచ్చునని అన్నారు. ఉపన్యాసం ముగిసిన మీదట నేనువెళ్ళి ఆయనను కలుసుకున్నాను "పదార్థ అంతర్ పరిణామంలో 'జ్ఞాన' ఆవిర్భావాన్ని చూడాలంటే మీరు వైట్‌ఫీల్డు వెళ్ళండి, బాబా తమ సత్ సంకల్పంతోనే వస్తువులను ఎలా సృష్టిస్తారో చూడవచ్చును" అని చెప్పాను. ఆయన నవ్వి ఊరు కున్నారు. మన భౌతిక విజ్ఞానశాస్త్రజన్య పరిజ్ఞానం పుస్తక పరిజ్ఞానం మాత్రమే. అది ఇంద్రియాల పరిధికి లోబడినది మాత్రమే. అంతకు మించిన, ఇంద్రియా తీతమైన నిగూఢ విషయాలు మనకు తెలియవు కాని భగవాన్ స్వయంగా 'జ్ఞాన'-విజ్ఞానమూర్తి.

భగవాన్ సర్వజ్ఞులని అనతి కాలంలోనే నాకు విదితమైంది. భగవాన్ మాట్లాడుతూ మధ్యమధ్య దృష్టిని నావైపే ప్రసరిస్తుండడం గమనించాను వారు తమ ప్రసంగంలో ఉదహరించే అంశాలు నా గత అనుభవాలకు సరిగా ముడిపడి ఉన్నాయనీ, వారు నాగురించే ప్రస్తావిస్తున్నారనే అనిపించిది. నా గత జీవితం వారికి పూర్తిగాతెలుసున్నట్లు అదేసమావేశం లో మరికొన్ని ప్రస్తావనలను బట్టి తెలిసింది. మన అందరిగురించిన భూత భవిష్యత్తులు భగవాన్‌కు తెలుసును. ఇందులో ఎట్టి సందేహంలేదు. మనకు తెలిసిన భౌతిక విజ్ఞానశాస్త్ర పరి జ్ఞానానికి ఇది సాధ్యంకాదు. మన అందరి మనో

భావాలను గ్రహించగల ఇంద్రియాతీతశక్తి స్వామికి ఉన్నది. దీనిని మీరు "టెలీపతీ" అనండి లేదా మరే పేరుతోనైనా పిలవండి. ఏపేరుపెట్టినా భావాన్ని మాటలు విశదీకరించలేవు. 'జ్ఞానం' మాటలకుఅందనిది. భగవానుని సర్వజ్ఞత్వం అనిర్వచనీయమైనది. భగవాన్ నిజంగా ఒక మెటా-సైంటిస్ట్' అనిపించింది.

ఆదే సమావేశంలో భగవాన్ విభూతిని, ఒక ఉంగరాన్ని, మరొక లాకెట్‌ను తమ సంకల్ప మాత్రాన సృష్టించి మాలోకొందరు సైంటిస్టులకు బహూకరించారు. భగవానుని ఈఅద్భుత చమత్కారం చూచినవారికే విశ్వాసం కుదురుతుంది, టి. ఐ. ఏఫ్. ఆర్. మిత్రుడు, సి. ఐ. ఎఫ్. ఆర్ డైరెక్టరు అన్నమాటలు నాస్మృతిపథంలో ఒకసారి మెదిలాయి.

భగవాన్ దివ్యానుగ్రహంతో లభించిన ఈ ఇంటర్వ్యూగురించి ఇంటికి తిరిగివెళ్లాక కొన్నిఅంశాలు నా మాతృభాష అయిన తెలుగులో వ్రాసుకొన్నాను. సనాతనసారథిలో ప్రొఫెసర్ పప్పు వ్యాసం చూదాక, అందలికొన్ని దివ్యోపదేశాలను గురించిన ఆనందాన్ని తదితర సాయిభక్తులతోపాటు నేనూ పాలుపంచుకోవాలనిపించింది. నాయీప్రయత్నానికి భగవాన్ ఆశీస్సులే బలం. నాకు అర్థమైనమేరకు భగవాన్ దివ్యోపదేశాలగురించి ఈచిన్న వ్యాసాన్ని నివేదించుకొంటున్నాను.

ప్రేమ అనేది మొదట నేను, నావారు అనే చిన్నపరిధికి బెలూన్‌లో గాలిమాదిరి పరిమితమై ఉంటుంది. గాలి ఊదిన కొలదీ బెలూన్ పెద్దది అవుతూఉంటుంది. చివరికి బెలూన్ పగిలిపోగానే అందలిగాలి చుట్టూఉన్న గాలిలో కలిసిపోతుంది. ఆదేవిధంగా ప్రేమకూడ విస్తరించి విస్తరించి విశ్వప్రేమలో విలీనం అవుతుంది. అప్పుడే అది దివ్యమైన దైవప్రేమ అనిపించుకొంటుంది.

మానవుడు ఇతరులకు ఇవ్వడంలో గల ఆనందాన్ని రుచిచూడాలి, దాని గుణంతో త్యాగభావాన్ని అలవరచుకోవాలి. మనం లోనికి గాలి పీల్చినప్పుడల్లా తిరిగి బయటకు విడిచిపెట్టడం లేదా? పీల్చినగాలిని శాశ్వతంగా లోపలనే అదిమిపట్టేందుకు సాహసిస్తామా? మనం లోపలకి తీసుకొనే ఆహార పానీయాలను మలమూత్రముల ద్వారా బయటికి విసర్జించటంలేదా? అదే విధంగా ధనాన్ని కూడ బెట్టి దాచుకోకుండా దానగుణాన్ని అలవరచుకోవాలి.

ఆత్మ పరమపవిత్రమైనది. ఒకసారి భగవాన్ అన్నమాటలు గుర్తుకు వస్తున్నాయి. "ఆత్మ విలువైనది కాబట్టే దేహంలో భద్రపరచుకొని నామ రూపములవంటి నిస్సారమైన వాటిని విసర్జించి వేస్తుంటాం, విలువైన ఆభరణాలను ఇనుప బీరువాలో దాచుకొని, పగిలిపోయిన కుండపెంకులను, పనికిరాని చింకిచాపలను బయటికి పారవేసినట్లే ఇదీను" అని భగవాన్ చెప్పారు.

సైన్సు అనేది మన ఇంద్రియాలకు సన్నిహితమైన ప్రకృతి రహస్యాలను మాత్రమే పరిశోధిస్తుంది వేదాలు మనకు అగోచరమైన, ఇంద్రియాతీతమైన రహస్యాలను వెల్లడిస్తాయి. ఆధ్యాత్మిక ప్రపంచంలో అడుగు పెట్టాలంటే ఇంద్రియాలకు అతీతమైన మహత్తర జ్ఞాననేత్రాన్ని అలవరచుకోవాలి అదిఒక అద్భుతమైన మాయాజాలాన్ని దాటటం వంటిది.

ఆకులు, పండ్లు ఒకే విత్తనంనుంచి పుట్టుకు వస్తాయి. పచ్చి ఆకులు పండుటాకులుగా మారతాయి. పచ్చి కాయలు పండ్లు అవుతాయి. చేదుగా, వగరుగా, ఉండే పచ్చికాయలు పండినమీదట మధురంగా ఉంటాయి. అదేమాదిరి మానవునిలోనిఈర్ష్యా ద్వేషాలు కోపతాపాలు వంటి దుర్గుణాలు జ్ఞానబలంతో దయ,

దానం ప్రేమవంటి ఉదాత్తగుణ సంపదగా ఏకత్వమవుతాయి. ఒకే జీవియొక్క విభిన్న పోకడలు ఇవి ఆత్మ అనేవిత్తనంనుంచే జీవులు ఆవిర్భవిస్తున్నారు జ్ఞానదృష్టిని అలవరచుకొన్నప్పుడు దుఃఖభూయిష్టమైన జీవత్వం పోయి ఆత్మానంద ఫలాలను అది ప్రసాదిస్తుంది.

విత్తనానికి పైపొట్టు ఉన్నంతవరకు అది ఎంతకాలం నిల్వఉన్నా, తిరిగి మొలకెత్తగలదు పైన కప్పిఉంతే భాగం పోయినప్పుడు అట్టి విత్తనంతిరిగి మొలకెత్తలేదు. విత్తనానికి పైభాగామే అది తిరిగి మొలకెత్తేందుకు కవచంగా ఉంటుంది అదిపోతే విత్తనం మొలకెత్తదు. అదే విధంగా సంస్కారాలు, వాసనలు పోనంతవరకు జీవికి జనన మరణచంక్రంలో పరిభ్రమణ తప్పదు. జీవికి ఈవాసనలు నశించినప్పుడు పునర్జన్మలేదు వాసనలు పునర్జన్మ హేతువులు. వాసనాక్షయమే జన్మరాహిత్యం.

కోరికలు ప్రకృతి సహజమైనవి. ప్రతి జీవికి కోరికలు అంటిపెట్టుకొని ఉంటాయి. జీవి + కోరికలు = నరుడు. జీవి — కోరికలు = నారాయణుడు కోరికలు తగ్గించుకొనేందుకై జీవి ప్రయత్నించాలి. కోరికలు చెప్పినట్లు దేహాన్ని ఆటలాటనివ్వకుండా చేయడం చాలాముఖ్యం. కోరికల చేతుల్లో దేహం కీలుబొమ్మ. ఒక సందర్భంలో భగవాన్ ఈవిషయాన్ని ఎంత చక్కగా అభివర్ణించారో చూడండి "కోతిని (మనసును) పరుగెత్తనివ్వండి, మీరు మాత్ర దాని వెంట పోకుండా ఉన్నచోటనే ఉండండి. కోతివంటి మనసువెంట మీశరీరాన్ని నడవనివ్వకండి ఈదేహాన్ని నీసేవకునిగా అనుమతించబోమని మీమనసులకు ఖచ్చితంగా చెప్పండి" అని అన్నారు.

ప్రేమ అంటే ఏమిటి ? నిజమైన భక్తినే ప్రేమ అనాలి అనురక్తి నుంచి అది వస్తుంది ఒక తల్లికి 20 ఏళ్ల కుమారుడు, రెండుగంటల క్రితమే పుట్టిన మరొక బిడ్డ ఉన్నారనుకోండి పసిబిడ్డను పోగొట్టుకున్నప్పటికన్న మొదటి కొడుకు పోయినప్పుడు ఆమె పొందే దుఃఖం ఓదార్చనలవికానిదిగా ఉంటుంది. ఎందువల్ల ? అనురక్తే దానికి కారణం.

అన్నంతినేటప్పుడు ఒకవిధమైన తృప్తిని అనుభవిస్తుంటాము మధ్యలో పంటి క్రింద ఒకచిన్న రాయి పడిందనుకోండి అంతవరకు ఉన్నహాయికాస్త ఎగిరిపోతుంది మన సుఖాన్ని చెదరగొట్టడానికి ఒక చిన్నరాయి సరిపోయింది. అదేవిధంగా పరిస్థితులన్నీ అనుకూలంగా ఉన్నప్పుడు కాలం హాయిగా వేగంగా దొర్లిపోతుంటుంది. ఒక చిన్న కష్టం వచ్చిపడేసరికి కాలాన్ని భారంగా లాగుతున్నట్లుంటుంది.

అధికప్రసంగం కూడదు ఎక్కువగామాట్లాడితే ఇతరుల దృష్టిలో చులకన అయిపోతారు. అధికప్రసంగంవల్ల మీశక్తిఅంతా వృధా అయిపోతుంటుంది మాటలను తగ్గించడంవల్ల లభించే శక్తిని అంతకన్నా మంచి పనులకు సద్వినియోగపరచుకోవచ్చును అంతేకాదు, మితంగా మాట్లాడడంవల్ల స్పర్థలు, కలహాలు రాకుండా చేసుకోవచ్చును. "అతిగా మాట్లాడడం మానండి ఇతరుల గురించిన వ్యాఖ్యానాలు కట్టిపెట్టండి. తప్పనిసరి అయినప్పుడు మాత్రమే మాట్లాడండి. ఆకొద్ది మాటలైనా మధురంగా మాట్లాడండి. కల్లకపటం లేకుండా ఎవరిని నొప్పించకుండా మాట్లాడండి." అని భగవాన్ ఒక సందర్భంలో చెప్పారు

ఇంటర్వ్యూ పూర్తి అయిన మీదట భగవాన్ మా అందరికీ విభూతి పొట్లాలు పంచిపెట్టారు. ఆ సమయంలో ఈ "సైంటిస్టులు, ప్రొఫెసర్లు" భగవాన్ సన్నిధిలో ఎలా తన్మయులైనారో చూస్తేగాని నమ్మలేరు. తల్లిచుట్టుచేరి నాకిదికావాలి, అది కావాలి. అనికోరే పిల్లల మాదిరిగా మారిపోయారు. సాయిమాత మహత్తర ప్రేమమూర్తి అనడంలో ఆశ్చర్యం ఏముంది !

—డాక్టర్ పి. రామమూర్తి

# సర్వాంతర్యామి

"నేను ఎల్లప్పుడు మీ వెంటనే ఉంటాను, మీలోనే ఉంటాను. మే చుట్టూతా, మీ ప్రక్కనే ఉంటాను." అనే ప్రేమభరితమైన బాబా పలుకులు మనకెంతో ధైర్యాన్ని ఇస్తుంటాయి. బాబా ఇచ్చిన హామీ తిరుగులేనిదనడంలో సందేహం లేదు. కాలిఫోర్నియాలో ఇటీవల ఒక ఆదివారమునాడు ప్రశాంతమైన సాయం సమయాన భక్తులను సంభ్రమాశ్చర్యాలలో ముంచెత్తిన అద్భుత సంఘటన ఇది.

శాంటాఆనాకు చెందిన సాయిబాబా కేంద్రం సభ్యులు ఎప్పటివలెనే ఆరోజు సాయంత్రము మా గృహములో సమావేశమైనారు. ఇండియానుంచి వచ్చిన ఒక రాకుమారుడు మా సత్సంగములో అతిథిగా పాల్గొని ప్రసంగించారు. ఆయన శ్రీసత్య సాయిబాబాపట్ల అకుంఠిత భక్తి ప్రపత్తులుగల భక్తుడు. ఆ రోజు సాయంత్రము జరిగిన సత్సంగం అపురూపమైన ఒక ప్రత్యేకతను సంతరించుకొన్నదని చెప్పవచ్చును. రెండు దేశాల సంస్కృతులు సంగమించిన ఆత్మీయత, ప్రేమ, భగవంతుని పట్ల ఆర్తి మా అందరికి విందుచేసిన మరుపురాని సన్నివేశము అది.

సత్సంగ సమావేశము ముగిసిన మీదట సాయిబాబా కేంద్రం వ్యవహారాలగురించి మాట్లాడుకొనేందుకై సాయి కేంద్రం బోర్డు సభ్యులం మరి కొంత సేపు అక్కడనే ఉన్నాం. ఎనిమిదిమంది వరకుగల మా సభ్యులం కూర్చొని మా అభిప్రాయాలు వెల్లడించుకొన్నాము. సత్సంగంలో కలిగిన దివ్యానుభూతులగురించి ఆనందముతో ముచ్చటించుకొంటున్నాం.

ఉన్నట్టుండి ప్రక్కగదిలోనుంచి గంట మ్రోగినట్లు బాబా కంఠధ్వని వినిపించింది. రామ, రామ, రామ అంటూ మృదు మధురంగా పాడుతున్న స్వామి కంఠము విన్నతోడనే మా మాటలు మధ్యలోనే ఆగిపోయాయి. ఒకరిముఖాలు ఒకరం ఆశ్చర్యంతో చూచుకొన్నాము. ప్రక్కగదిలోనుంచి స్వామి దివ్యవాణి ఇంకా వినిపిస్తూనే ఉన్నది. భగవాన్ ప్రేమ సందేశము మా హృదయాలపై వర్షిస్తూనే ఉన్నది. ఒక చిన్న టేబులుమీద ఉన్న టేప్‌రికార్డును ఒక అదృశ్య హస్తం, "ఆన్" చేసినట్లయింది. బాబా మా సత్సంగాన్ని అనుగ్రహించి, ఆశీర్వదించారు. ఆనందముగ్ధులమైన మేము అలానే కూర్చుండిపోయాము. ఎవరినోట మాట లేదు. ఆర్ద్రమైన హృదయాలతో, ఆనంద భాష్పాలతో ప్రశాంత నిశ్శబ్ద గంభీరతలో ఉండిపోయాము. మన స్వామి మనవెంటనే ఉన్నారనీ, మన ప్రతి మాట ఆలకిస్తున్నారని. మనం చేసే ప్రతి పనీ తిలకిస్తున్నారనీ, మన మనోభావాలన్ని వారికి తెలుసుననీ అనుభూతమైంది. నిజం, స్వామి ఎల్లప్పుడూ మనవెంటనే ఉన్నారు.

—ఫ్రాన్సెస్‌రీవెస్.



# స్వామి లీల

1979 మార్చి 22 తేదీ గురువారం ఉదయం భగవాన్ నన్ను అనుగ్రహించి ప్రశాంతినిలయంలో నాకు ఇంటర్వ్యూ ఇచ్చారు. అత్యంత ఆకర్షణీయమైన ఒక ఉంగరాన్ని సృష్టించి స్వామి నాకు బహూకరించారు. ఆఉంగరంలో ఎఱుపు, నీలం కలసిన రంగులో స్వామి ప్రసన్న వదనం ప్రతిబింబిస్తున్నది. తరువాత ఎందుకో నాలో ఒక భావన కలిగింది. ఉంగరంలో కనిపిస్తున్న స్వామిరూపం నామనసుకు నచ్చిన రీతిలో మరింత ఆకర్షనీయంగా వేరే నమూనాలో ఉండే బాగుండును అనిపించింది. స్వామి నన్ను ఆశీర్వదిస్తున్నట్లు ఎప్పుడూ కనిపిస్తుంటే ఎంత బాగుండును అనిపించింది. అదీగాక ఉంగరం నావ్రేలికి చాలబిగుతుగా ఉన్నది. మొత్తంమీద ఆ ఉదయం సంతోషంగానే ఉన్నాను. ఏదో కించిత్తు ఆవేదనకూడా ఆ సంతోషంలో మిళితమైఉన్నది. వృత్తి రీత్యానేను ఒకసర్జన్‌ను. ఆపరేషన్ మున్నగు పనులు చేస్తూ, తరచు నా చేతులు కడుక్కొంటుండాలి. ప్రతిసారి వ్రేలికున్న ఉంగరం తీస్తుండాలి. కాని స్వామి ఇచ్చిన ఉంగరం చాల బిగుతుగాఉండడంతో అతి కష్టంమీదగాని తీయడం సాధ్యమయ్యేలా లేదు. మరొక ఆలోచనకూడ నాలో మెదలింది. నావెంట ఇండియాకు రాలేకపోయినా భార్యగుర్తుకువచ్చింది. అపురూపమైన ఇట్టి సందర్భంలో నావెంట ఆమె లేకపోవడం ఏదో లోటుగా కనిపించింది. ఆమెకుకూడ గుర్తుగా భగవాన్ ఏదైనా ఇస్తే బాగుండును కదా అనిపించింది. కాని ఇంతటి స్వల్పమైన కోరికను స్వామిని నేను ఎల్లా అడిగేది ?

ఆదేరోజు సాయంత్రము స్వామి నన్ను లోనికి రమ్మని మరోమారు పిలిచారు. స్వామి సన్నిధికి వెళ్ళడమే తడవుగా భగవాన్ ఎంతో ప్రేమతో పలకరించారు. "ఉంగరం కొంచెము బిగుతుగా ఉన్నట్లున్నదే ! సర్జన్లు తరచు చేతులు శుభ్రం చేసుకోవలసి ఉంటున్నదికదా" అన్నారు. ఏది ఉంగరం ఇవ్వు అని అడిగితీసుకున్నారు. ఆ ఉంగరాన్ని చేతిలోకి తీసుకొని దానిమీదికి ఒకసారి ఊదారు. తిరిగి నా ఎడమచేతి ఉంగరపు వ్రేలికి తొడిగారు. అంతే, ఆ ఉంగరం నా వ్రేలికి ఎంతో ముచ్చటగా బిగుతుగాని, వదులుగాని లేకుండా చక్కగా సరిపోయింది. కృతజ్ఞతగా స్వామి పాదములకు సాష్టాంగవందనం చేసుకొన్నాను, ఉంగరంలోని బొమ్మను చూడు అన్నారు స్వామి. ఆశ్చర్యపోయాను. అందులో కనిపిస్తున్నది నేను ఇందాక చూచినది కాదు. చిరునవ్వులు చిందే స్వామివదనం అత్యంత ఆకర్షణీయంగా నా హృదయానికి మహదానందాన్ని కల్గిస్తున్నది. "నేనిక్కడ ఉండగా భయమెందుకు ? అన్నట్లుగా స్వామి అభయహస్తంతో నాకు ఉంగరంలో సాక్షాత్కరించారు. నాకు కావలసిన రీతిలో కనిపిస్తూ స్వామి నా అభీష్టాన్ని నెరవేర్చి ఆనందముగ్ధుణ్ణి చేశారు. స్వామి అనుగ్రహము అంతటితో ఆగలేదు. నా భార్యయోగ క్షేమాల గురించి అడిగారు. అంతలోనే అందమైన ఒక లాకెట్‌ను సృష్టించి ఇచ్చారు. ఆ లాకెట్‌లో ఒకవైపున స్వామి సుందర విగ్రహం ఉన్నది. మరోవైపున సంస్కృతంలో "ఓం" చక్కబడి ఉన్నది. "ఇది నీభార్యకు" అంటూ స్వామి తియ్యని పలుకులొలికించారు.

—డాక్టర్ వి. కె. పిళ్ళై
సింగాపూర్.

# స్వర్ణయుగానికి సోపానం

సాయి యుగంలో మానవసేవలో నిమగ్నులైన లక్షలాది మందికి మాధవుని దర్శన, స్పర్శన భాగ్యం ప్రత్యక్షంగా లభిస్తున్నది. ఆధ్యాత్మిక సాధన ద్వారా ఏ కొద్ది క్షణాలో పొందే భగవదనుభూతి కాదు ఇది. అది భౌతిక మార్గంలో మతప్రచారకులు, భక్తి ప్రపత్తులు గలవారు అనుదినం తమ ధ్యానకాలంలో తరచు ఏ పదిహేను నిమిషాలపాటో అనుభవించే దివ్యానుభూతి కాదు ఇది. సాయిభక్తులు మానవ దేహంలోనే భగవానుని అనుక్షణం ప్రత్యక్షంగా దర్శించ గలుగుతున్నారు, సశరీరంగా భగవానుని సాన్నిహిత్యాన్ని అనుభవించగలుగుతున్నారు. సాయి యుగం యొక్క ప్రత్యేక విశిష్టత ఇది.

ఏకాగ్రత ద్వారా లభించే బలం, భక్తిప్రపత్తుల సోపానాలు, నిజమైన భగవదనుభూతి లోతుపాతులు సద్గుణ సంపదను, సత్ప్రవర్తనను, ప్రశాంతతను, ప్రేమపూరితమైన సమబుద్ధిని పాదుగొల్పి పూర్ణ స్థితికి గొనిపోతాయి. దైవ ప్రేమలో ఈర్ష్యా ద్వేషాలు లేని జీవితపుష్పం దివ్యసౌరభాలను వెదజల్లుతుంది. దైవ ప్రేమ ఒక అమూల్య ఆభరణం వంటిది. అట్టి ఆభరణాన్ని ధరించినవారు తరతమ భేదంలేకుండా సర్వుల పైన దివ్యప్రేమ అనే కాంతులను వెదజల్లుతారు.

ఆధ్యాత్మిక సౌధాన్ని అధిరోహింపచేయగల ఇట్టి దైవగుణ సంపద, సాయి స్పర్శ లభించిన సుకృతాత్ములందరితో పెంపొందుతూ, క్రమ వికాసంలో ప్రశాంతతను వెదజల్లుతుంటుంది. సత్య సాయిబాబా కళాశాల విద్యార్థులకు ఇట్టి దైవీగుణ సంపద మేలిమి బంగారంలా సహజ స్వభావంగా భాసిస్తుంటుంది. అనుక్షణం వారు అవతారమూర్తి సాన్నిధ్యంలో పునీతులు కావడమే ఇందుకు కారణం. భగవాన్ పిలుపు కోసం వారు నిరంతరం నిరీక్షిస్తూ, స్వామి ఆజ్ఞలను శిరసావహించడానికి సంసిద్ధతతో ఉంటారు. సునిశితమైన బుద్ధి సూక్ష్మత, ప్రశాంత వదనాలు, కష్టపడి పని చేయడానికి వెనుదీయని స్వభావం, క్రమశిక్షణాయుతమైన జీవితం వారిలో త్రికరణ శుద్ధిగా ఓతప్రోతమై ఉంటాయి. వారిలో కాఠిన్యం కనిపించదు. నమ్రతతో సముచిత వ్యవహారాలకు ఆనుకొంటుంటారు. వినమ్రులై చిత్త శుద్ధితో కర్తవ్యాన్ని నిర్వహించడంలో వారికి వారే సాటి. ఆదర్శ విద్యార్థులుగా సద్గుణాలతో సుసంపన్నులై ప్రశాంతభామానికి దివ్య సోపానాలుగా వుంటారు.

ఈ విద్యార్థులు పెద్దవారైన మీదట ఎక్కడెక్కడ తమ జీవితాలను సాగించాలో స్వామికి ముందుగానే తెలుసును. వారు చేరవలసిన గమ్యస్థానంలో చక్కగా విధులను నిర్వహించగలిగేటట్లు అవసరమైన రీతిలో స్వామి తగిన శిక్షణ గరుపుతుంటారు. కర్తవ్య నిర్వహణకు కావలసిన శక్తి సామర్థ్యాల నిచ్చి, సమగ్రమైన వ్యక్తులుగా వారిని తీర్చిదిద్దే బాధ్యతను స్వామి అపార కరుణతో స్వీకరించారు. సామాన్య భారతీయ గృహాల నుంచి వచ్చిన ఈ విద్యార్థులను ప్రేమ స్వరూపులుగా, వివేక సంపన్నులుగా, దైవీభావంతో కర్తవ్యాన్ని నిర్వహించే నిష్కామ కర్మయోగులుగా, పవిత్రాత్ములుగా తీర్చి

దిద్దుతున్నారు. ఇంతటితో సాయి ఆగలేదు. ప్రస్తుత అవతారంలో రానున్న నలభైరెండేళ్లలో మరి రెండు తరాలవారిని మానవ సేవకు అంకితంకాగల దివ్యాత్మ లను మానవాళికి ప్రసాదించ దలచారు. సాయి గృహాలలో రెండు తరాల ఉత్తమ సంస్కారాన్ని సంతరించుకొని, ఏబది సంవత్సరాలపాటు సాయి భగవానుని దివ్యహస్తాలలో పెరిగిన మానవాళి భాగ్యం ఏమని చెప్పాలి? ఏ విధమైన వ్యక్తిత్వాలతో రూపొంద గలరో అట్టి సుకృతాత్మల గురించి ఏమని ఊహించ గలం? నిజంగా ఇది మానవాళి అదృష్టమని చెప్పక తప్పదు. ధర్మసంస్థాపనతో స్వర్ణయుగానికి సోపానాలు వేయగలనని స్వామి ఇచ్చిన హామీ నెరవేర నున్న దనడంలో సందేహం లేదు. సాయి అవతారం మానవాళి మహాదాృగ్యమే.

మానవాళి సముద్ధరణ కార్యక్రమాన్ని చేపట్టిన సాయి తన పనిని కొనసాగించడానికై ప్రేమసాయిగా అవతరించనున్నారు. షిర్డీసాయిబాబా తొంభై ఏళ్లకుపైగా మానవాళిని ఆదుకొన్నారు. సత్యసాయి తమ ప్రస్తుత అవతారం 96 సంవత్సరాలు సశరీరంగా ఉంటుందని ప్రకటించారు. ప్రేమసాయిగా తిరిగి భూమిపై అవతరించి 90 ఏళ్లకుపైగా ప్రేమను కురిపించవచ్చు. అపురూపమైన ఇట్టి ప్రేమావతారం వల్ల మరి అయిదు తరాల వరకు జ్ఞాన రత్నాలవంటి పవిత్రాత్మలు మానవాళి సేవకు అంకితులు కాగలరు. సాయి ప్రేమవాహినిలో పెరిగిన ఎనిమిదవ తరం ఏ విధంగా ఉంటుందో, వారి ప్రవర్తన ఎలా ఉంటుందో ఊహించగలమా? వారి హృదయం ప్రేమ నిలయమై ఉండదా? వారి నేత్రాలు ప్రేమ వెల్లువలను వర్షించవా? వారి హస్తాలు ప్రేమను, శాంతిని ప్రపంచ మానవాళిపై వెదజల్లవా? వారు సాక్షాత్తు ప్రేమావతార మూర్తులు, దైవాంశ సంభూతులు అయిఉండరా? ఒకే పరమాత్మ అనేక నామరూపాలతో ఏకకాలంలో అవతరించి మానవాళిని తరింపజేయగల స్వర్ణయుగమై అది భాసించదా?

గులాబి మొగ్గను పరీక్షించి, వికసించినమీదట ఆ పుష్ప సౌందర్యం ఇలా వుంటుందని ఎవరైనా చెప్పగలరా? గులాబి మొక్కను, దాని రెమ్మలను, ఆకులను, పెనవేసుకొని ఉన్న వ్రేళ్లను పరిశీలించినంత మాత్రాన అది పూచే పుష్పాల వైభవాన్ని ముందుగా అభివర్ణించగలమా? లేక, గులాబి మొక్క వ్రేళ్ల సంరక్షణలో తగిన శ్రద్ధవహిస్తే, రెమ్మల చివర తప్పక పూచే అందమైన గులాబీలను చూడగలమా?

రామావతార కాలంలో ఆ అవతార విశిష్టతను గుర్తించినవారు కొద్దిమంది మాత్రమే. కృష్ణుని కాలంలో ఆయనను అవతార మూర్తిగా విశ్వసించిన వారే అరుదని అంటారు. బుద్ధుని అనుయాయులు ఆసియాలలో ఎందరినో సముద్ధరించారని తెలుసు. జీసస్ అనుచరులు ఆసియా, ఆఫ్రికా, ఐరోపాలలో కొద్దికాలంపాటు తమ దివ్యత్వంతో ఆదర్శప్రాయులైనారు.

విశ్వాంతరాళంలో ఒక చిన్న గ్రహమైన ఈ భూతలంపై తొమ్మిది తరాల కాలంపాటు భగవానుని సాన్నిహిత్యంలో దైవీగుణాలను నింపుకొన్న దివ్యాత్మలు నిర్విరామంగా సాగించే సముద్ధరణ పవిత్ర వాహినితో మానవాళి పునీతం కాదా? భగవంతుని స్పర్శ నుంచి ఇక ఎవరైనా తప్పించుకో గలరా? అవతార పరంపరలో దివాత్మ స్వరూపులుగా ఆవిర్భవించే సాయి సంతాన ప్రేమవాహినిలో మున్కలు వేయని వారంటూ ఎవరైనా ఉండగలరా? సాయి అవతార పూర్తి విశిష్టత, మానవాళిపై దాని ప్రభావం ఏమని ఊహించగలం? అనిర్వచనీయమైన సాయి అవతార నిజతత్త్వం, సాయి యుగ వైభవ విస్తృతి ఏ రీతిని అభివర్ణించగలం?

—లీహ్యూలేట్

# ఆధ్యాత్మికత ఆవశ్యకత

పరమాత్మతో సాయుజ్యానికి భక్తి ప్రపత్తులతో జీవితాన్ని అంకితంచేయడమే నిజమైన ఆధ్యాత్మికత. ఆత్మానుభూతి పొందడానికి ఆ రీతిలో నిరంతరం చేసే ప్రయత్నమే ఆధ్యాత్మికత అనిపించుకొంటుంది. భగవంతునిలో ఐక్యం కావాలని పరితపించే జీవితమే ఆధ్యాత్మిక జీవితం, ఆధ్యాత్మిక జీవిత అగత్యం ఏమిటో దీనిలోనే సుస్పష్టం అవుతున్నది. ఆత్మను అన్వేషించి, పరమాత్మసాయుజ్యం పొందడమే జీవిత పరమావధి. భగవదంశ ఆధారంగానే సకలజీవులు మనుగడ సాగిస్తున్నాయి. ఆత్మశక్తి లేకుంటే జీవితమేలేదు. దైవేచ్ఛలేనిదే ఒకగడ్డి పరక కూడ కదలదని అంటారు. అనంతమైన ఒకేచైతన్య శక్తి అంతటా నిండిఉన్నది. దానినే భగవంతుడని అంటూంటారు సృష్టిజాలం యావత్తు సర్వేసర్వత్రా వ్యాపించిఉన్న ఆపరమాత్మ శక్తికి లోబడే ఉన్నది. జీవరాసి కదలికలన్నీ అనంత చైతన్య శక్తి ఆధారంగానే జరుగుతుంటాయి.

పైకి జడపదార్థాలుగా కనిపించేవాటిలో సైతం చైతన్య శక్తి అంతర్భూతమై ఉన్నట్లు ఆధునిక విజ్ఞాన శాస్త్రం నిరూపించింది. ప్రతి పదార్థంలోను మూల భూతమైన అణువులు విభిన్న గుణాలను ప్రభావితం చేస్తుంటాయని కనుగొన్నారు. కాబట్టి జీవసృష్టి యావత్తు ఆత్మశక్తినుంచి వేరుకాదని విదితమవుతున్నది అయినాకూడ ఆధ్యాత్మిక వైపు అనురక్తుడు అయ్యే వ్యక్తిని వింతగాచూడడం సాధారణంగా కనిపిస్తూ ఉంటుంది జీవితంలో నైరాశ్యానికి గురిఅయినవారు కొందరు, లేదా ఐహిక ప్రయోజనాలను ఆశించి కొందరు ఆధ్యాత్మిక మార్గానికి మళ్లుతుంటారని భావిస్తుంటారు. కాని ఇది ఎంతవరకు నిజం ? ఒక వ్యక్తి ఆధ్యాత్మిక మార్గంలో అడుగు పెట్టడానికి ఈకారణాలు అనివార్యమా ? దివ్యాత్మ స్వరూపుడైన మానవుడు తన స్వస్వరూపాన్ని తెలుసుకొనేందుకు, అట్టి అనంత చైతన్య శక్తిలో విలీనం కావడానికి ప్రయత్నించడంకన్న సహజమైనదేముంటుంది ? అసలు ఇట్టి ప్రయత్నం చేయక పోవడం ఆత్మవంచనే అవుతుంది. తన నిజస్వరూపాన్ని తెలుసుకోడానికి ప్రయత్నించడం లేదంటే భ్రమలనే మేఘాలక్రింద ఇంకా సతమతమవున్నట్లే భావించాలి అట్టివ్యక్తి ఇంకా మాయాజాలం నుంచి బయట పడలేదనీ భ్రాంతులు తొలగలేదనీ గ్రహించి "మానవ పరిణామ పరిసరిసనూ ప్తికి, మానవుడు సర్వోన్నతమైన తన గమ్యస్థానాన్ని అనుభూత మొనర్చుకోవడానికి మతము, ఆధ్యాత్మికపు క్రమ శిక్షణ చాలాముఖ్యం" అని భగవాన్ శ్రీసత్యసాయి బాబా చెప్పారు. "కడుపుకు తిండికంటెకూడ మానవునికి ఆత్మసాక్షాత్కార సాధనకు తోడ్పడే ఆహారం చాలాముఖ్యం" అని స్వామి అన్నారు.

ఒక జీవి ఒక జన్మనుంచి మరోజన్మకు సాగించే మహా ప్రయాణంలో గతజన్మ గురించి పూర్తిగా విస్మృతి చెందుతున్న మానవుడు తన మరణానంతరం ఏమిటని, ఈజీవితంలో తపనపడడం ఎందుకని సామాన్యులు ప్రశ్నించవచ్చును, మరుజన్మగురించి

ప్రస్తుత జీవితాన్ని వ్యర్థచేసికొనే బదులు ప్రస్తుత జీవితంలో వీలైననంతవరకు ఏవిధంగానైనే సరే ఐహిక కోర్కెలను తనివితీరా అనుభవిస్తూ హాయిగా జీవితం గడిపేందుకు ప్రయతించడం మంచిదనివారు వాదించవచ్చును. ప్రతివ్యక్తిలోను నిహితమైఉన్న దైవాంశ (ఆత్మ) ఒక్కటేననీ, అనంతచైతన్య శక్తి (పరమాత్మ)లో అది భాగమేననీ ఆధ్యాత్మిక శాస్త్రాలు ఘోషిస్తున్నాయి. ప్రతివ్యక్తిలోను అంతర్భూతంగాఉన్న దైవాంశ తనకొకవ్యక్తిత్వాన్ని కల్పించుకొంటున్నది. అఖండ చైతన్యశక్తిలోతాను అంతర్భాగమనే సంగతిని విస్మృతి చెందడంవల్లనే భేదదృష్టి ఏర్పడి భిన్నత్వం గోచరిస్తున్నది. స్వ స్వరూపవిస్మృతినే అహంకారం లేదా అజ్ఞానం అంటారు. దేహపతనానంతరం జీవి ప్రయాణానికి ఇట్టి అహంకారమే దారిబత్తెం. ఇదే పునర్జన్మ హేతువు. అహంకారం, కోరికలు, సంకల్పాలు, కర్మలు, తదితర వాసనలు ఎంతెంత బలంగా ఉంటాయో తదనుగుణమైన వ్యక్తిత్వ భావనతో ఆజీవి తిరిగి జన్మించడం జరుగుతుంటుంది. భౌతిక దేహాన్ని వదలినమీదట అంటే మరణానంతరం సూక్ష్మశరీరం ఇంద్రియాలకు అగోచరమైన అనేక ఆధ్యాత్మిక లోకాలలో పయనించడం జరుగుతుంది. అందువల్ల ఇహలోకంతో వ్యక్తి యొక్క అహంకారం, కోరికలు, సంకల్పాలు, కర్మలు తదితర వాసనలతో బాటు దేహపతనానంతరం ఆజీవి అలౌకిక లోకాలలో పయనిస్తూ తిరిగి జన్మించినప్పుడు తదనుగుణమైన స్వరూప స్వభావాలు వస్తూంటాయి. దేహపనానంతరం సూక్ష్మ శరీరం పయనించే లోకాలు ఏడుఉంటాయని దేవీ భాగవతం, విష్ణుభాగవతం తెలుపుతున్నాయి. ఆలోకాల పేర్లు :- భూలోకం, భువర్లోకం, సువర్లోకం, మహర్లోకం, జ్ఞానలోక, తపోలోకం, సత్య లోకం, ముండ కోపనిషత్తు, ఛాందోగ్యోపనిషత్తు కూడ ఈలోకాల గురించి ప్రస్తావించాయి.

మానవుడు ఇహకంలో చేసే కర్మలు, సంకల్పాలనుబట్టే ఒకటి లేదా తదితర ఆధ్యాత్మికలోకాలలో సూక్ష్మశరీర ప్రయాణం పొందే అనుభవాలు ఆధార పడి ఉంటాయి. ఉదాత్తమైన, పవిత్రమైన సంకల్పాలు, కర్మలుచేసుకొన్న సూక్ష్మ శరీరానికి సత్యలోకం దుష్ట సంకల్పాలు లేదా రాక్షస ప్రవృత్తి గల సూక్ష్మశరీరానికి భువర్లోకం ప్రాప్తిస్తాయి. అటూ ఇటూగాక మధ్యరకాల సంకాల్పాలు, కర్మలుచేసుకున్న సూక్ష్మశరీరం వాటి బలాన్ని బట్టి తదనుగుణమైన తదితర లోకాలలో తిరగవలసిఉంటుంది. స్థూలదేహాన్ని విడిచినమీదట సూక్ష్మశరీరాలు తిరగవలసిన అధ్యాత్మికలోకాలు, ఆయాజీవాల పవిత్రత నిస్వార్థతల తరతమ స్థాయిపై ప్రధానంగా ఆధార పడి ఉంటుంది.

మానవుడు ఇహలోకంలో చేసే సంకల్పాలు, కర్మల స్వభావాన్ని. బలాన్ని బట్టే అతని సూక్ష్మ శరీరం తదితర లోకాలలో తదనుగుణమైన సంస్కారాలను పెంచుకొంటుంది. ఈ వాసన బలమే అతనిలో అంతర్భూతమై ఉన్న దైవాంశ చుట్టూ శరీర రూపంలో గూడుకట్టుకొని ఒక ప్రత్యేక వ్యక్తిత్వ భ్రాంతిని కలిగిస్తుంది. దీనినే 'జీవాత్మ' అంటారు స్థూలదేహాన్ని విడిచిన మీదట అనగా మరణానంతరం సూక్ష్మశరీరం లేదా జీవాత్మ తన ప్రయాణాన్ని సాగిస్తుంటుంది. అధ్యాత్మికలోకాలలో, ఒకటి లేదా అన్నింటిలో అది తిరుగుతూ ప్రతిలోకంలో తదనుగుణమైన కోర్కెలతో వేధించబడుతుంటుంది. కాని స్థూలశరీరం లేని కారణంగా వాటిని అనుభవించే శక్తిలేక అక్కడ నిలవజాలకపోతుంది జీవాత్మ ఏ లోకంలో ఎంతకాలం తిరగవలసినది. ఇహలోకంలో అదిచేసుకొన్న కర్మ వానసల బలాన్ని బట్టి ఆధారబడి ఉంటుంది. మరల స్థూలదేహం వచ్చేవరకు సూక్ష్మ శరీరానికి ఇట్టి యాతనామయ ప్రయాణం తప్పదు.

ఉదాహరణకు జన్మరాహిత్యం (మోక్షం) పట్ల బలవత్తరమైన ఆకాంక్షతో దేహాన్ని విడిచిన జీవి తరువాతి జన్మలో మోక్ష సాధనకు అనుకూల పరిస్థితులు గల వున్నత ఆధ్యాత్మిక కుటుంబంలో జన్మించవచ్చు. ఇహలోకంలో జీవితమంతా సత్సంకల్పాలతో తదనుగుణమైన కర్మలతో గడిపిన జీవికి మాత్రమే అంత్యకాలంలో ధృఢమైన మోక్షేచ్ఛ నిలుస్తుంది మోక్ష సాధనవైపే అట్టి జీవి పయనించడం జరుగుతుంది అలాగాక దుష్టమైన కోరికలతో స్థూల శరీరాన్ని విడిచిన జీవి దుష్టభూయిష్టమైన వాతావరణంలో తిరిగి జన్మించడం జరుగుతుంది. ఇది ఒక నిరంతర ప్రయాణంగా సాగుతుంది. సూక్ష్మశరీరం తన మలినాలను పోగొట్టుకొనడానికి, మోక్షమనే చరమ లక్ష్యం వైపు పురోగమించడానికి, అనంత చైతన్య శక్తి (పరమాత్మ)లో విలీనమవ్వటానికి ప్రతినూతన జన్మ ఒక సదవకాశంగా లభిస్తుంటుంది. ఇట్టి సదవకాశాన్ని తరించడానికి ఉపయోగించుకొని జీవి జనన మరణ చరిత్రలో పరిభ్రమిస్తూ ఆభాస మాత్రమైన సుఖాలతో అనంతమైన బాధలను అనుభవించక తప్పదు. ఆధ్యాత్మిక జీవితాన్ని సాగించాలని ధృఢ నిశ్చయం చేసుకొన్న వ్యక్తి జీవితం సుఖమయం కావడమే గాక పరమాత్మ సాయుజ్యమనే అంతిమ గమ్యస్థానంవైపు శరవేగంగా పయనించిన వాడవుతాడు.

ఆధ్యాత్మిక మార్గంలో పయనించే వ్యక్తి జీవితానికి, ఆత్మశక్తి ప్రేరణగా వుంటుంది కాబట్టి అతనిలో దైవీగుణసంపద నిండివుంటుంది. దుర్గుణాలు అతన్నించి దూరమవుతుంటాయి. సుఖశాంతులు సమస్థితి, సామర్థ్యం, తేజస్సు అతనికి స్వభావసిద్ధములు అవుతాయి. తుదకు అట్టి వ్యక్తికి స్థితప్రజ్ఞత అలవడుతుంది.

భగవాన్ శ్రీ సత్యసాయిబాబా ఉపదేశించేనట్టు ఆధ్యాత్మిక జీవితమంటే కేవలం జపధ్యానాదులు మాత్రమే కాదని సద్గుణ సంపదలతో కూడిన సత్ ప్రవర్తన అలవడినప్పుడే నిజమైన ఆధ్యాత్మిక జీవితంగా అది రాణించగలదు.

ఆధ్యాత్మిక మార్గాన్ని అనుసరించే వ్యక్తులతో కూడిన సమాజం నెలకొన్నప్పుడే ప్రపంచంలో సుఖశాంతులు, సామరస్యం సాధ్యమౌతాయి. ఆధ్యాత్మిక ధృక్పధం లేని వ్యక్తులతో కూడిన సమాజంవల్ల మానవాళికి సుఖశాంతులు లభించవని వేరుగా చెప్పనక్కరలేదు.

— డి. హెజ్మాడి.



# చాలా దూరం - ఎంతో దగ్గర

"తద్దూరే తదన్తికే" (అది చాలా దూరంలో వుంది. కానీ ఎంతో దగ్గరగానూ వుంది) ఈశోపనిషత్.

"దూరస్థం చ అన్తికే చ తత్" (అతడు దూరంగాను వున్నాడు. దగ్గగానూ వున్నాడు (భగవద్గీత)

మనకు భగవంతుని అస్తిత్వంలో అచంచలమైన విశ్వాసం వుంది. మనకు "భగవంతుడంటా ఒకడు వున్నాడా?" అనే సందేహం రాదు. భగవంతుడు సృష్టికర్త. సకల చరాచర జగత్తుకూ ఈశ్వరుడు. మార్పులేని సత్యం భగవంతుడు. అతడు సర్వవ్యాపి. అతడు సృష్టికర్త. అతనిని తెలుసుకోలేని నిస్పృహాయ స్థితిలో "భగవంతుడు ఎక్కడ వున్నాడు?" అనే ప్రశ్నకు మనం సమాధానం పొందవలసిన అవసరం మనకు లేదంటారా?

కొందరికి మాత్రమే ఈ ప్రశ్నకు సమాధానం తెలుసు. మనకు తెలిసిన భాషలో భగవంతుని మనం వర్ణించలేము. కనుక తెలిసిన వారు పై ప్రశ్నకు గల సమాధానాన్ని గూఢమైన పదాలతో, శబ్దాలతో మాత్రమే వర్ణించగలరు. "అందుగల డిందు లేదని సందేహము వలదు, చక్రి సర్వోపగతుండు", అంటూ ప్రహ్లాదుని మాటలనే మనం చెప్పగలం. కానీ కోపావిష్టుడైన తండ్రి ప్రశ్నకు సమాధానంగా నిస్సందేహంగా "సంశయ మేల? నాకు స్తంభమునందునూ భగవానుడు గోచరిస్తున్నాడు", అని ఎలుగెత్తి చాటటం ఒక్క ప్రహ్లాదునికే చెల్లింది. పరమేశ్వరు ఎల్లెడల వ్యాపించి వున్నప్పటికీ మానవుడు పరమేశ్వరాన్వేషణలో తిరుపతి కొండ మెట్లు ఎక్కుతూ, వారణాశి, పూరీ క్షేత్రాలను దర్శించుతూనే వున్నాడు! శాంతి కోసం హరిద్వారం, బదరీనాథం, హృషీకేశం యింకా ఎన్నెన్నో మధుర ద్వారకాది దివ్య క్షేత్రాలలో తిరుగుతున్నాడు. ఇంకొందరు తమ యిండ్లలోనే ఒక మూల దేవతా మందిరం ఎదుట చేతులు మోడ్చి, అశ్రుపూరిత నయనలతో తమ సంక్షుభిత మనస్సులను తేలిక పరచి, ఈ జీవిత సమరంలో పోరాడే శక్తి ప్రసాదించవలసినదిగా భగవంతుని ప్రార్థిస్తూ వుంటారు. ఒక్కమాటలో చెప్పవలెనంటే మానవుడు అక్కడకు ఇక్కడకూ ఎల్లెడలకు భగవంతుని అన్వేషణలో పరుగులు తీస్తున్నాడు, భగవంతుని పేరుగల ప్రదేశాలన్నీ చూస్తున్నాడు.

"భగవంతుడు స్వర్గంలోనో, కైలాసంలోనో, వైకుంఠంలోనో లేడు. ఎక్కడో ఒకచోట భగవంతుడున్నాడనీ, ఆ ప్రదేశంలోకి పోవాలనీ అనుకోవటం ఖండించదగిన ఒక మూఢ నమ్మకం. భగవంతుడు సర్వగతుడు. సర్వాంతర్యామి. సర్వకాలములలోనూ వున్నవాడు, అతడు అందరికీ, అందరిలోనీ సాక్షి.", అని యుగావతారుడైన భగవాన్ బాబా మనకు విస్పష్టమైన భాషలో చెబుతున్నారు. పరమ దయళుడైన బాబా యిలా ప్రకటించుతూ వుండగా మనం ఆనందంతో పులకించి పోతూవుంటాము! భగవాన్ ప్రబోధం వింటున్నంతసేపూ మన ఆలోచనలన్నీ స్తబ్దంగా నిలబడిపోతాయి. అపుడు భగవత్సామ్రాజ్యం మనకు

చేరువలో వున్నట్లే వుంటుంది. అయితే మన కర్మాను సారంగా స్వామి దివ్య సమక్షం నుంచి తప్పుకోగానే, సందేహాలన్నీ మనల్ని చుట్టుముట్టుతూ వుంటాయి! మళ్లీ మన ఏకాంత అన్వేషణలో "దేవుడెక్కడ ?" "ఎక్కడ సుఖశాంతులు ?" "దివ్యధామం ఎక్కడ?" అనే ప్రశ్నలూ సందేహాలూ మనల్ని వెంటాడుతూ వుంటాయి !

ఇలా అనటంలో నాభావాన్ని అపార్థం చేసుకో వద్దని మనవి. దేవాలయాలూ, మందిరాలూ పవిత్ర క్షేత్రాలూ, దివ్యధామాలూ మానవుని ఆధ్యాత్మిక వికాసంలో వాటికి సంబంధించిన ప్రాముఖ్యతను కలిగే వున్నాయి. మనిషిని దైవం వైపు నడిపేదీ, అతనికి ఆత్మ పరిణామం కలుగ జేసేదీ ఎదైనా అప్రస్తుతం కాదు, అప్రధానం కాదు. కానీ ఈ అన్వేషణ ఎక్కడో వుంటున్న దేవుని కోసం అయితే ఏదో ఒక క్షేత్రంలోనే పొందగలిగే ఆ దివ్యత్వం కోసం అయితే అలాటి అన్వేషణ నిరర్థకం. అప్పుడు "దేవు డెక్కడ వున్నాడు" అనే ప్రశ్నకు సమాధానం పొందకపోయినా నష్టంలేదు.

దివ్యాత్మ చాలా దూరంగా వున్నదని ఉపనిషత్తు చెబుతుంది. ఎంతవేగంగా పరుగెత్తే దానినయినా ఆత్మ అధిగమిస్తుంది అంటుంది ఉపనిషత్తు. అలాటి ఉప నిషత్ వచనాలు చాలా గంభీరమైనవి, అర్థవంతమైనవి. మానవుని మేధస్సు దేశకాలముల పరిభాషలోనే వస్తువులను ఘటనలనూ నిర్దేశించగలదు. అలాటి దేశానికీ కాలానికీ స్వతః యదార్థత లేదు. అవి మనస్సుచేత సృష్టింపబడి మరల మనస్సును పోషించేటివి. "దూరస్థం... (అది దూరంగా వుంది)" సత్యాను భూతిని యింతకంటె ఎలా చెప్పగలం? ఈ సత్యాను భూతి ప్రాపంచిక జీవితానికీ, యింద్రియ జగత్తుకూ, బుద్ధిగతమైన సదవగాహనకూ సంబంధించినది కానేరదు.

మన గమ్యం చాలా దూరంగా వున్నదా ? మనం చేయవలసిన ప్రయాణం నిజంగా సుదూర మైనదా ? ఈ ఆధ్యాత్మిక వికాసం కోసం పాటుపడే సాధకులందరికీ మన మహర్షులు, తపస్సులు కఠోర మైన నియమ నిష్ఠలు ఏందుకు ఏర్పరచారు ?

ఈ నియమనిష్ఠలను ఈఒక్క జీవితంలోనేకాక యింకా జన్మించవలసిన వందలాది జన్మల్లో కూడా పాటించవలసినవిగా ఎందుకు ఏర్పరచారు ? ప్రతి వ్యక్తి యొక్క ఆంతర్య ప్రకృతికీ అనువుగా, వారి వారి అధికారస్థితికి అనుగుణంగా, వారి మేధస్సునకు అనుగుణంగా అనేకమైన మార్గాంతరాలను, సాధనాంత రాలను మన శృతులు ఎందుకు ఏర్పాటు చేశాయి ? జ్ఞానం, భక్తి, కర్మ, యింకా ఆయా మార్గాల అనుబంధ సాధనలు ఈ ఆత్మాన్వేషణ పథం చాలా దూరమైనదనే విషయాన్ని రూఢపరుస్తున్నాయి. ఈ మార్గాలన్నీ "ఎవరిని అన్వేషించుటకు ?" అనే ప్రశ్నకు ఆస్కారం కలిగిస్తాయి. బ్రహ్మసూత్ర భాష్యంలోని వ్యాఖ్యలో "తత్ దూరే-" అది దూర మైనది! అజ్ఞానిచేత కోటాను కోట్ల సంవత్సరాల అనంతరం కూడా అది పొంద సాధ్యం కానిది కనుక అది దూరమైనది అని వివరించారు ! మన స్వకీయ మైన ప్రకృతిని గూర్చి మనకేమీ తెలియనందువల్ల మనం కూడా "జ్ఞానవంతులం" అని ఎలా చెప్పుకో గలం ?

మనలకు సరియైన దోవలో ప్రవేశ పెట్టి, సరైన దిక్కును సూచించి ఎంత దూరంలో వున్నా మనం చేరుకోగల గమ్యాన్ని నిర్దేశించే జ్ఞానాన్ని మనం ఎలా పొందగలం ? ఇలాటి ఆధ్యాత్మిక జ్ఞానా నికి కూడా ప్రతి భౌతిక సమస్యకూ పరిష్కారం సూచించే దని అనుకుంటున్న, సైన్సునే మన ఆశ్ర యించుతూ వున్నాం. మన తెలివితేటలు, విజ్ఞానం ప్రాపంచిక దృష్టిలో మునిగితేలుతూ వున్నాయి. మన

ఆలోచనలూ ప్రాపంచికమైన ప్రమాణాలతో నిండి వున్నాయి. ఈ జీవితం అనే అర్థంకాని సమస్యకు పరిష్కారం కనిపెట్టే విషయంలో మన మేధస్సు పనికి రానట్టే దివ్యజ్ఞానం ప్రసాదించే మరేదైనా ఆధారాన్ని మన మేధస్సు కనిపెట్టలేదు.

సైన్సు పురోగతీ, సాంకేతిక ప్రగతీ జీవిత సమస్యలను పరిష్కరించి భూతలం మీద స్వర్గం సృష్టించగలదని ప్రపంచ ప్రజ విశ్వసించింది. ఈ సైన్సు, సాంకేతికముల ప్రగతి మానవుని నైతిక శీలాన్ని వదలివేయగా, అతనిలోని పాశవిక ప్రవృత్తిని విశృంఖలంగా విడిచిపెట్టింది. సైన్సు నిస్సందేహంగా భౌతిక ప్రపంచానికి ఎంతో సమకూర్చింది. అయితే ఈ భౌతిక దృష్టి మనిషికి కావలసిన నిజమైన సుఖ శాంతులను అందివ్వలేదు. ఒక గ్రహానికీ మరొక గ్రహానికీ మధ్యగల దూరాన్ని సరిగ్గా అంచనా వేయ గల సైన్సు మనిషిలోగల మేధస్సును ప్రదీప్త పరచే చిత్ శక్తి మనిషికి ఎంత దూరంలో వున్నది, ఎంత దూరంగా వున్నదీ తెలుసుకోలేక పోతున్నది.

కాబట్టి భౌతిక దృష్టితో, వైజ్ఞానిక దృష్టిలో మనకు ఈ దివ్య సత్యం ఎంత దూరంలో వున్నదో దాన్ని చేరటానికి ఎంతకాలం పడుతుందో, ఎలాటి వాహనం ద్వారా అక్కడికి చేరుకోవాలో తెలుసుకొనే ఆలోచనలకు మనం స్వస్తి చెబుదాం. మానవుని జ్ఞానానికీ, మేధస్సుకూ ఆధారభూతమైన అనిర్వచనీయమైన శక్తిని మనం వివరించలేము. నది, దాని పుట్టుకకు ఆధారమైన స్థానంకంటె ఎత్తుగా పొంగి ప్రవహించలేదు.

ఈ ఆధ్యాత్మిక లక్ష్యం, గమ్యం దేశకాలాది ద్వంద్వ స్థితిలోగల ఎలాటి గమ్యం కంటె కూడా చాలా ఉన్నతమైనది అని మనం నిరభ్యంతరంగా చెప్పవచ్చు. సజీవ సృష్టిలో మానవుడు అధికుడనీ, సృష్టిలో అతని స్థానం ఉన్నతమనీ మనం అంగీకరించాలి. ఇతర జీవరాసుల వలె మానవుడు సాధారణ జీవరాసుల ధర్మాలకు కట్టుబడి వుండడు. అతడు కొన్ని పాశవికమైన ప్రవృత్తులకు కూడా అతీతుడు. శరీరం యొక్క వ్యామోహాలకు లొంగి బ్రతకాలా, లేక దానిని అధిగమించి నైతిక ఆధ్యాత్మికమైన స్థాయికి వికసించాలా అనే వానిలో ఏదో ఒక దానిని మానవుడు నిర్ణయించుకోవాలి. ఈ వికాస క్రమంలో మానవుడు పశువు కంటె అగ్రగామి. పశువుకు యిలా నిర్ణయించుకొనే శక్తి లేదు. మనిషికి బుద్ధి శక్తి వుంది. దాని సహాయంతో మానవుడు యింకా ఉన్నత స్థితికి ఎదిగి దివ్యత్వాన్ని, తన స్వకీయమైన ప్రకృతిని తను పొందగలడు. దానినే 'భగవత్ సామ్రాజ్యం' అనే పేరుతో క్రైస్తవ ధర్మం మానవునికి అంద జేస్తుంది. అది ఒకానొక దీప్తివంతమైన విజ్ఞాన స్థితి. అది భోగభాగ్యములను అనుభవించుట కోసం కాదు.

వివిధ మతాలలో భగవంతుని గూర్చిన అభిప్రాయాలు వేర్వేరుగా వుండవచ్చు. కానీ ఆయా మతాలు తెలియజేసే సత్యం, సారాంశం ఒక్కటే. ఆ సత్యాన్ని వివరించే వివిధాంశాలూ వివిధ మార్గాలుగా ఏర్పడి వుండవచ్చు. పాశ్చాత్య దృక్పథంలో భగవంతుడనే వాడు "అందరియొక్క ఆరాధనలూ స్వీకరించే మహోన్నత తత్త్వం"గా ఎంచబడుతున్నాడు. అటువంటి మహోన్నత తత్త్వం చేత మనం ఆకర్షింపబడుతాం, మన సంపూర్ణమైన ఆరాధనను సమర్పించుతాం. భగవంతుడే మానవునిలోగల ఆశాభావం! ఆపదలో భగవంతుడే మానవునికి గల ఆశ్రయం! భారతీయ తత్త్వశాస్త్ర రీత్యా భగవంతుని ఏ రూపంలో నయినా దర్శించవచ్చు; పరమేశ్వరుని సర్వగతునిగా ఉపాసించవచ్చు; బాహ్యంగా కనిపించే ఈ వైవిధ్యం వెనుకగల ఏకత్వంగా ఆరాధించవచ్చు. ఈ విషయంలో ఉపనిషత్తులు, గీత ప్రతిపాదించిన భగవతత్త్వ నిరూపణ పద్ధతి చాలా విశిష్టమైనది.

మానవుని ఆధ్యాత్మిక వికాసం కొరకు దోహదం చేసిన ఈ భారతీయ తత్త్వశాస్త్ర దృక్పధాన్ని పాశ్చాత్య తత్త్వవేత్తలు కృతజ్ఞతా భావంతో అభినందించాను!

పరమేశ్వరుడే మనలోని అంతరాత్మ కూడా అవుతున్నాడు. అతడు మనకు వెలుపలగా లేడు. తాను సృష్టించిన జగత్తు అంతటా వ్యాపించి, దాని స్థితికి కారణభూతుడైనాడు. ఈ సృష్టివలయం, బ్రహ్మాండం అంతా అనంతుడైన పరమేశ్వరుని ఆంశిక వ్యక్తీకరణమే. "విష్టభ్యాహ మిదం కృత్స్నం ఏకాంశేన స్థితో జగత్" (నాలో ఒక అంశంతోచే ఈ సృష్టి అంతటా వ్యాపించి వున్నాను) అంటుంది గీతావాణి. "ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేర్జున తిష్ఠతి । భ్రామయన్ సర్వభూతాని యన్త్రారూఢాని మాయయా". "పరమేశ్వరుడు సర్వభూతముల హృదయమునందును నివసించుచున్నాడు, యంత్రము నందలి వానివలె తనయొక్క మాయాశక్తి చేత వానిని పరిభ్రమింప జేయుచున్నాడు" (గీత 18/61). "అది అన్నింటిలోనూ గల అంతరాత్మ" అని కేనోపనిషత్తు నిర్వచనం. "అంగుష్ఠ మాత్ర పురుషుడై సర్వ దేహ గతుడైన వాడు పరమేశ్వరుడు. అతడే భూత భవితవ్యములకు ప్రభువు" అటుంది కేశోపనిషత్తు. అంగుష్ఠ మాత్రప్రమాణంమీద మనం విచారించ నవసరంలేదు. ఆచార్య శంకరులు దీనినిగూర్చి వివరించారు. "హృదయం లోపలి అంగుష్ఠ ప్రమాణంలో పరమేశ్వరుడున్నట్లుగా భావించటంవల్ల అది ధ్యాన సాధనకు చాలా సహకరిస్తుంది. ఆత్మయే పురుషుడు- అనగా సృష్టిఅంతటా వ్యాపించి వుండువాడు," అన్నారు శంకరులు.

(సశేషం)



మే 13, 1979 నాడు బొంబాయిలో భగవాన్ ఆశీస్సు లందుకొంటున్న శ్రీ జయప్రకాశ్ నారాయణ్.

# ప్రకటన

శ్రీ సత్యసాయి డిగ్రీకాలేజీ, ఆర్ట్సు, సైన్సు, కామర్సు కోర్సులలో ఈ క్రింద చూపిన కాంబినేషన్‌లతో:

హిస్టరీ, ఎకనామిక్సు మరియు పొలిటికల్ సైన్సు
,, ,, ,, ఫిలాసఫీ
ఫిలాసఫీ, సైకాలజీ మరియు సోషల్‌వర్క్సు
మేథమాటిక్సు, ఫిజిక్సు మరియు కెమిస్ట్రీ
బోటనీ, జూలజీ మరియు కెమిస్ట్రీ
కామర్సు గ్రూపు

మరియు శ్రీ సత్యసాయి జూనియర్ కాలేజీలో క్రింద చూపిన కాంబినేషలతో ఇంటరుమీడియట్:

కామర్సు, ఎకనామిక్సు మరియు సివిక్సు
హిస్టరీ, ఎకనామిక్సు మరియు సివిక్సు
బయలాజికల్ సైన్సులు, ఫిజిక్సు మరియు కెమిస్ట్రీ
మేథమాటిక్సు, ఫిజిక్సు మరియు కెమిస్ట్రీ

తరగతులతో 1వ తారీఖు జులై, 1979 నుండి ప్రారంభించబడును. ఇంగ్లీషులో బోధింపబడు పై కోర్సులలో తగిన అర్హతలుగల విద్యార్థులందరకు ప్రవేశము గలదు. ప్రవేశము కోరు విద్యార్థులు తెల్లకాగితముపై వారు ఉత్తీర్ణులైన పరీక్షల వివరములు, ప్యాసుఅయినశ్రేణి, సంపాదించుకున్న మార్కుల వివరములు వ్రాసి దరఖాస్తులు ఈ క్రింది చిరునామాకు జూన్, 15, 1979 నాటికి చేరునట్లుగా పంపవలెను.

ప్రిన్సిపాల్,
శ్రీ సత్యసాయికాలేజీ,
ప్రశాంతినిలయం పోష్టు (Pin: 515 134)
అనంతపూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్.

కాలేజీలో చేరిన విద్యార్థులకు హాస్టలు సదుపాయము కలదు.

—ప్రిన్సిపాల్.

# పుస్తకములు

| | పేరు | వెల | తపాలా ఛార్జి |
|---|---|---|---|
| | అద్భుత మూర్తి-(హవార్డ్ మర్ఫేట్ ఆంధ్ర అనువాదం-అమరేంద్ర) | 6-00 | 0-10 |
| | రామకథ రసవాహిని | 9-00 | 0-60 |
| 3. | గీతావాహిని | 3-50 | 0-30 |
| 4. | జ్ఞానవాహిని | 1-50 | 0-10 |
| 5. | సత్యం శివం సుందరం (1) | 5-00 | 0-30 |
| 6 | సత్యం శివం సుందరం (2) | 5-00 | 0-25 |
| 7. | సత్యం శివం సుందరం (3) | 5-00 | 0-25 |
| 8. | శ్రీ సత్యసాయి భగవల్లీల (ఉప్పాడ రాజారావు) | 1-50 | 0-15 |
| 9. | సూక్తి రసతరంగిణి (ఉప్పాడ రాజారావు) | 2-00 | 0-25 |

| | పేరు | వెల | తపాలా ఛార్జి |
|---|---|---|---|
| 10. | శ్రీ సత్యసాయీశ్వర నుతి తరంగిణి (1) (ఉప్పాడ రాజారావు) | 3-00 | 0-35 |
| 11. | శ్రీ సత్య సాయీశ్వర నుతి తరంగిణి (2) (ఉప్పాడ రాజారావు) | 2-00 | 0-25 |
| 12. | సుధాబిందువులు | 5-00 | 0-30 |
| 13. | సువర్ణ సుమమాల | 5-00 | 0-30 |
| 14. | సత్యసాయి వచనామృతం (2) | 4-00 | 0-25 |
| 15. | భజనావళి | 2-00 | 0-20 |
| 16. | భాగవతవాహిని | 3-00 | 0-25 |

ఆంధ్ర రాష్ట్రపు, హైదరాబాదులోని ప్రోగ్రెసివ్ ప్రెస్ ప్రయివేట్ లిమిటెడ్ యందు, బి. వి. సత్యమూర్తిచే ముద్రింపబడి, యన్. కస్తూరిచే, శ్రీ సత్యసాయి ఎడ్యుకేషన్ అండ్ పబ్లికేషన్ ఫౌండేషన్, ప్రశాంతి నిలయం తరఫున ప్రచురింపబడినది. ఎడిటర్ : యన్. కస్తూరి, యం. యె., బి. యల్.

## శ్రీసత్యసాయి ఎడ్యుకేషన్ అండ్ పబ్లికేషన్ ఫౌండేషన్, ప్రశాంతి నిలయం,

అనంతపురం జిల్లా. ఆంధ్రప్రదేశ్. పిన్ నం. 515134

### పత్రికలు / పుస్తకములకు ఆర్డర్లు.

**A** (1) పత్రికలు : ఒక సం॥కు తక్కువ కానీ 5 సం॥ల కెక్కువ కానీ స్వీకరింప బడవు

| ఇండియా | | | వార్షిక చందా |
|---|---|---|---|
| మాస పత్రిక | సనాతన సారథి | ఇంగ్లీషు | 6 రూ. |
| మాస పత్రిక | సనాతన సారథి | తెలుగు | 6 రూ. |
| త్రైమాసిక పత్రిక | సేవాదళ్ | ఇంగ్లీషు | 4 రూ. |
| త్రైమాసిక పత్రిక | శ్రీ సత్యసాయి బాలవికాస్ | ఇంగ్లీషు, హిందీ (ఒకే పత్రికలోనే) | 4 రూ |

విదేశములు

| | సనాతనసారథి | | సేవాదళ్ | | బాలవికాస్ | |
|---|---|---|---|---|---|---|
| | సీమెయిల్ | ఏర్‌మెయిల్ | సీమెయిల్ | ఏర్‌మెయిల్ | సీమెయిల్ | ఏర్‌మెయిల్. |
| | రూ. | రూ. | రూ. | రూ. | రూ. | రూ. |
| ఆఫ్ఘనిస్థాన్ | 16 | 26 | 9 | 12 | 9 | 12 |
| ఆఫ్రికా | 16 | 46 | 9 | 18 | 9 | 18 |
| అమెరికా | 16 | 51 | 9 | 20 | 9 | 20 |
| ఆసియా ఖండపు దేశములు | 16 | 31 | 9 | 14 | 9 | 14 |
| ఆస్ట్రేలియా | 16 | 46 | 9 | 20 | 9 | 20 |
| బర్మా | 16 | 26 | 9 | 12 | 9 | 12 |
| యూరోప్ ఖండపు దేశములు | 16 | 46 | 9 | 18 | 9 | 18 |
| పసిఫిక్ సముద్ర ప్రదేశములు | 16 | 51 | 9 | 20 | 9 | 20 |
| శ్రీలంక | 8 | 21 | 8 | 10 | 8 | 10 |

(2) సనాతన సారథికి చందా పంపునపుడే ఏ భాషలో (తెలుగు, ఇంగ్లీషు) కావలెనో తెలుపవలెను. చందా గడువు పొడిగించు సమయమునందును, మీ అడ్రసు నందు మార్పు అవసరమని తెలుపు సమయమునందును చందా నంబరును వ్రాసి పంపవలెను.

B(1) **పుస్తకములు :** ప్రస్తుతము మా యొద్ద నున్న పుస్తకములు, వాటి వెలలు, ఇండియాలోని వాటి పోస్టు ఛార్జీలును క్రింద తెలియజేయబడినవి. రిజిస్టర్డ్ పోస్టులో మాత్రమే పుస్తకములు పంపబడును. కాన, రిజిస్టర్ ఛార్జీ రూ. 2-25 లు మీ ఆర్డర్‌తో పంపవలసియున్నది. V.P.P. ద్వారా పంపబడవు.

(2) పుస్తకముల పూర్తి పేర్లు అవి ఏ భాషలో కావలయును అనునది స్పష్టముగా ఆర్డర్‌లోనే తెలుపవలెను.

(3) ఫోటోలు/చిత్రములు పోస్టుతో పంపుటకు వీలు కాదు.

(4) కార్యాలయము నుంచి వివరములు తెలుసుకోవలెనన్న మీ చిరునామా గల స్టాంపు వేసిన కవరును పంపవలెను.

(5) పుస్తకముల ఆర్డర్లు—విదేశములనుంచి తపాలా ఛార్జీలు ఎంత అని ముందుగనే వ్రాసి తెలుసుకోవలెను.

(6) చందా మొత్తము కానీ, పుస్తకములకొరకు పైకము కానీ, శ్రీ సత్యసాయి ఎడ్యుకేషన్ అండ్ పబ్లికేషన్ ఫౌండేషన్ యొక్క చిరునామాకే పంపవలెను. మనియార్డర్ పంపువారు వెనుక భాగమందు తమ చిరునామాను పూర్తి వివరములతో స్పష్టముగా వ్రాయవలెను.

---

( పుస్తక సూచి : 144 వ పుటలో చూడండి )

Regd. No. H/HD/384

Licensed to post without Pre-payment No. H/8

"మనఏవ మనుష్యాణాం కారణం బంధ మోక్షయోః" ఈ బంధమోక్షములకు, మంచిచెడ్డలకు రెండింటికినీ మనస్సే కారణము. సాత్విక గుణమును అనుసరించినపుడు ఇవే సద్గుణములుగా వస్తున్నాయి. తామసిక, రాజసిక, గుణములను అనుసరించినపుడు ఇవే దుర్గుణములుగా బయలుదేరుతున్నాయి. ఇనుప ముక్కను మట్టిలో పడవేసినప్పుడు తుప్పుపట్టి అది అనేక రకములుగా తనశక్తిని కోల్పోతుంది. కానీ, అదే ఇనుపముక్కను నిప్పులో పడవేసినప్పుడు, తన రంగును కూడను మార్చుకొని, మెత్తగామారి, ఎఱ్ఱగామారి కావలసిన ఆభరణములు కానీ, కావలసిన వస్తువులు కానీ చేసుకోడానికి అనుకూలమైన పదార్థంగా తనలో ఉన్న దుమ్ము, ధూళి నంతా కూడను విసర్జించుకుంటుంది. ఇనుప ముక్క ఒక్కటే, కానీ పడవేసిన ప్రదేశము ప్రత్యేకమైనటువంటిది. అదే విధముగనే మనస్సు ఒక్కటే, కాని ఇది సాత్త్వికములో పడవేసినప్పుడు సద్గుణములుగా రూపొందుతుంది. తామసిక రాజసికములతో పడవేసినప్పుడు దుర్గుణములుగా రూపొందుతుంది."

— బాబా